REGD. No. M.4793

# గృహలక్ష్మి

15th Oct. 1951.



దసరా సంచిక

VOL. 20

# GRIHALAKSHMI

No. 10

Price As. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

సంపాదకుడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౨౦] అక్టోబరు 1951 [సంచిక ౧౦




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువకుసరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమునలకము. బయ్యాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రమే రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామా మార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక


ప్రధాన వ్యాసము : దసరా-గాంధిజయంతి 543

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము - మద్రాసు : 'సిసి' 545

గృహలక్ష్మి : సీమలపాటి సూర్యనారాయణ రావు గారు 547

గఫ్యస్ నృత్యనాటక కళ : 'టాన్' నుండి 548

దుర్గాపూజ : వేదవతీ దేవి గారు 551

ప్రబోధమంజరి : చింతలపూడి సన్యాసిరావు గారు 555

గాంధీగారి జీవితములోని ముఖ్యాంశములు వాటి కాలములు 556

గాంధితత్వము - "అహింస" : సత్తిరాజు సూర్యకాంతమ్మ గారు 559

స్త్రీ అంటే ఎవరు ? : ఎమ్. సుశీలాదేవి గారు 562

రచనానైపుణి : సూర్యదేవర సులోచనాదేవి గారు 565

వజ్రాలహారము : బి. గౌరీదేవి గారు 567

మామిడి : ఎమ్. ఆర్. సీతమ్మ గారు 570

సంపూర్ణజీవనానికి సాధనములు : నెమలి చంద్రమతిదేవి గారు 571

బాలవినోదం : అద్దేపల్లి సత్యేంద్రనాథ్ దీక్షిత్ గారు 573

పోటీకళ : 574

ఆత్మవిమర్శ : కీ. విజయరాఘవాచార్యులు, జి. భాగ్యలక్ష్మి గార్లు 575

ఆదర్శ మిధునం : సీమలపాటి సూర్యనారాయణ రావు గారు 577

"ఎన్నికలు" : మల్లవరపు హనుమాయమ్మ గారు 580

గృహవైద్యము : మ. వె. రమణమ్మ గారు 583

సినిమారంగము 584

'రాజ్యం ప్రతిభ' : దే. జయలక్ష్మి గారు 585

లోకవార్తలు 589

బాలలకు - బొమ్మలు : జె. క. టి. స్వామి గారు 591

పుష్పచయము 594

స్వీకారము 595

సంపాదకీయములు 597

పంచాంగం 598


(o)



పూ జ్య బా పూ జీ




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# దసరా-గాంధీజయంతి

యథోచితంగా నీ దసరా సంచికను మీ చేతుల కందిస్తున్నాము

దసరా మహోత్సవాల సందర్భమున సమస్త హిందూ ప్రజానీకం దేవీ పూజలతోటి, వేడుకలతోటి, బంధుమిత్ర పరివారసమేతంగా అత్యంత ఉత్సాహంతో గడిపియుంటారు.

నూతన వస్త్రాభరణాలంకరణలేమి, బొమ్మలకొలువులేమి, వచ్చేపొయ్యే ముత్తైదువులకు చందన తాంబూలాది సత్కారములేమి, యాచకులకు దానధర్మములేమి ప్రతియొక్క గృహమునందును ఈ నవరాత్రి ఉత్సవాల సందర్భమున ప్రముఖపాత్ర వహిస్తవి. మీరు సర్వశక్తి సమన్వితయగు దేవిని, దుర్గా, లక్ష్మి, సరస్వతుల పేర్లతో విశేష భక్తి శ్రద్ధలుకలిగి పూజించి యుంటారు.

దేవి దయామయురాలు. లోకం మంచి చెడ్డలు ఆమె దయానుగ్రహములమీదనే ఆధారపడియున్నవి. కాబట్టే ఆమెను లోకమాత అని పూజిస్తున్నాము. అలాగే మన మాతృదేవి మోసి, కని, పెంచి, మనకొరకు మహోన్నతమయిన త్యాగములు చేసినందుకు ఆమెను పూజించడం ధర్మం. తల్లిని ప్రత్యక్షదైవమన్నారు. ఆమె ప్రేమ అవ్యాజమైనది. మాతృదేవి ఆశీర్వచనమువలన, బోధనలవలన పురాణకాలంలోనేమి, చారిత్రా

త్మకంగా నేమి అనేకమంది మహాపురుషులైరి, దిగ్విజయములను సాధించకలిగిరి. రావణుడు ఆత్మలింగాన్ని సాధించబోయినప్పుడు, సీతాదేవి పుత్రులు లవ, కుశులు తమ తండ్రి శ్రీరామచంద్రునితోటి, అతని తమ్ములతోటి పోరి జయించబోయినప్పుసు, శివాజి, పతనావస్థలోనున్న హిందూ ప్రజాకోటిని ఉత్తేజపరచి మహమ్మదీయ సామ్రాజ్యమును ఛిన్నాభిన్నము చేసి హిందూసామ్రాజ్యాన్ని స్థాపించపూనుకొన్నప్పుడు వారి మాతృ దేవతల ఆశీర్వచనములు, బోధనలు దిగ్విజయమును సమకూర్చకలిగినవి. కాబట్టి మాతృపూజ ప్రాధాన్యాన్ని గుర్తించి దేవి అనుగ్రహంతోబాటు మాతృదేవి దయాను గ్రహాలకుకూడ పాత్రులై సకల శుభంబుల నొందుదురుగాక!

అంతేకాదు; దేవిపూజవలన వ్యక్తిగతంగా మీరు మాత్రం ఆమె అనుగ్రహము నకు పాత్రులై ఆయురారోగ్య ఐశ్వర్యములను పొందటంలో పరమార్థంలేదు. "సర్వే జనాస్సుఖినోభవంతు" అనే విశాల దృష్టితో దేవిని ప్రసన్నురాలనుచేసి ఆమె యను గ్రహము మూలంగా సర్వజనులు సుఖించునట్లు కృషి చేయడం చాల ఉత్తమం.

దేవి శక్తి స్వరూపిణి. దయార్ద్ర హృదయ. మంచి చెడ్డలను, న్యాయాన్యాయ ములను విడదీసి చెడుగును, అన్యాయమును రూపుమాపి మంచిని, న్యాయమును ప్రోత్స హించగలది. ఆ యాదిశక్తి కరుణా కటాక్షములవలన విచక్షణా జ్ఞానము వృద్ధియయి, విశాల దృష్టితో ప్రపంచ కల్యాణమునకు కృషిచేయుటకు శక్తి సామర్థ్యాలను ప్రసా దించమని దేవిని ప్రార్థించడం ఉత్తమం. అట్టి ప్రార్థనను దేవి సయితం మన్నించి అనుగ్రహిస్తుందనే మా నమ్మకం.

గాంధీజీపేరు వినని వారుండరు. దసరా సందర్భంలో సయితము ఆ మహనీయుని బొమ్మలను కొలువులో నమర్చియుంటారు. అక్టోబరు నెల 2.వ తేదిన గాంధీజీ జన్మదినం. గాంధీ జయంతి జరుపడానికి సమావేశాలు, పూజలు, ఉత్సవాలు జరిగినవి. కాని ప్రజలలో చిత్తశుద్ధి లేదేమోననడం సాహసం కాదు.

నిన్న మొన్నటిదాక మనతోనుండి, మనకొరకు అహోరాత్రులు కృషిచేసి తుదకు తన ప్రాణములను సయితము మానవసేవలో త్యాగముచేసిన మహనీయుని, ఆయన బోధించిన సత్య అహింసలను ఉదాసీన భావంతో చూడటం క్షేమకరంకాదు. కులమత వర్గరహిత సమాజ నిర్మాణమునకు గాంధీజీ చేసినకృషి ఏమాత్రము అనుసరించబడు తున్నదో చూచి విచారపడవలసిన విషయం. గాంధీజీ జీవితం ఆదర్శప్రాయమైనది. ఆయన బోధనలు శాంతి అభ్యుదయాలవైపుకు మార్గము వంటివి. గాంధీజీ జీవితాన్ని ఆదర్శంగా నుంచుకొని ఆయన బోధనలను ఆచరణలో పెట్టిననాడు మనము వాస్తవంగా గాంధీ జయంతి జరిపిన వారమగుతాం కాని, విగ్రహాలను నెలకొల్పి పూజలు చేయుడంవలనను, దీర్ఘ ఉపన్యాసాలు యిచ్చినందువలన లాభంలేదు. గాంధీజీ జీవితాదర్శముల నను సరించుటకు వలసిన ఆత్మబలం, దీక్ష, త్యాగములను దేవి మనకు ప్రసాదించుగాక!

# ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము — మద్రాసు

రాష్ట్రనిర్మాణ సమస్య చిత్ర విచిత్రముగా ననేకరూపములు చెందుచున్నది. ప్రధాని పండిత నెహ్రూ అంతటివాడు స్థూలంగా దక్షిణాదిలో ఏకీభావం కుదిరితేనే కాని రాష్ట్రనిర్మాణం సాధ్యం కాదన్నాడు. అంటే తమిళులు, కన్నడులు మనమీద దయదలచి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు సమ్మతిస్తేనే నిర్మాణము సాధ్యమన్నమాట! ఈ పరిస్థితులలో ఆంధ్రులస్థితి ఎంత హీనంగానుందో పరికించుకోవాలి.

ఆంధ్రులు కోరుతున్నది ఏమిటి? తెలుగుభాష మాట్లాడేజాతి తమయొక్క, తమభాషయొక్క అభివృద్ధినికోరి రాష్ట్రనిర్మాణం కోరుతున్నది. ఇందులో ఒకరి దయాదాక్షిణ్యాలు అనవసరం. ఒకరి ఆస్తిపాస్తులను కోరడంలేదు. ఇంతకుముందు ఏర్పడిన రాష్ట్రాలకు యిట్టి షరతులేవియు విధించబడియుండలేదు.

మనము కోరేరాష్ట్రమునకు ఆర్థిక సౌష్టవమునకు గాని, నాయకత్వమునకు గాని, పరిపాలనా సమర్థులకుగాని, విజ్ఞానవేత్తలకుగాని కొరతలేదు. మరి దేనికికొరత బడిందంటారు? ప్రజలలో దీక్ష, బాధ్యతా నిర్వహణ, త్యాగబుద్ధి కొరతపడినవి.

స్వామీ సీతారాం ప్రభృతులు రాష్ట్రనిర్మాణ సాధనకని ప్రాయోపవేశం సాగించి విరమించారు. ఆచార్య వినోభావే ఆంధ్రరాష్ట్ర నిర్మాణకృషిలో తన సంపూర్ణ సహకారమును వాగ్దానముచేస్తూ దీనిని అఖిలభారత సమస్యగా చేస్తానని ప్రకటించాడు. రాష్ట్రపతి, ప్రధానమంత్రులు తమ సానుభూతిని ప్రకటిస్తూ తమ సహకారాన్ని వాగ్దానంచేశారు. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘం జె. వి. పి. రిపోర్టు కనుగుణ్యమైన రాష్ట్ర నిర్మాణం వెంటనే జరుగాలని తీర్మానించింది.

వినోభావే చిత్తశుద్ధిని శంకించడములేదు. కాని మిగిలిన రాష్ట్రాలలో తన కార్యక్రమం సాగినంత విజయవంతముగా దక్షిణాదిన సాగదు.

కులమత విభేదాలు అనైక్యతను దారితీస్తవని గంభీరోపన్యాసాలిస్తూ, కులమత తత్వాలను జాతీయవాదులనేవారు రెచ్చగొడుతున్న ప్రాంతము దక్షిణాది. త్యాగబుద్ధి, నిజాయితీ, న్యాయాన్యాయాల పరిశీలనల మంటగలిపి స్వార్థమునకు, అవినీతికి, అన్యాయానికి ఉనికిపట్టయినది దక్షిణాది. ఈప్రదేశంలో వినోభావే సంకల్పం నెరవేరుతుందనుకోడం ఎట్లు?

స్థూలంగా ఏకాభిప్రాయం కుదరందే రాష్ట్రనిర్మాణం సాధ్యంకాదని కేంద్ర ప్రభుత్వనాయకులు ప్రకటిస్తునేయున్నారు. ఇది అంత సులభమయిందికాదు. ఇంత

కాలమునుండి అఘాయిత్యంగానో లేక మరేవిధంగానో అనుభవిస్తున్న అవకాశములు చేయిజారిపోవడం తమిళులు సహించి అంగీకరిస్తారా ?

ఇక జె. వి. పి. రిపోర్టు కనుగుణ్యమైన ఆంధ్రరాష్ట్రం ఆంధ్ర ప్రజానీకానికి సమ్మతమయిందికాదు, గౌరవప్రదమైందికాదు.

ఇక రాష్ట్ర నిర్మాణం ఎలా జరుగుతుంది? రాబోయే జనరలు ఎన్నికలలో ఆంధ్ర ప్రదేశంలో జె. వి. పి. రిపోర్టు ప్రాతిపదిక కావాలి. ఆంధ్రుల ఆత్మగౌరవాలకు భంగము కలుగనట్టి రాష్ట్ర నిర్మాణము జరుగాలని ప్రజాభిప్రాయాన్ని వ్యక్తపరచి అట్టి బాధ్యతను పూనుకొనువారికే ఓట్లివ్వాలి.

రాష్ట్రం ఒకరు దానా ధర్మంగా నిచ్చేదికాదు. న్యాయమైన హక్కు. ఇందులో స్వార్థములేదు. నలుగురితోబాటు ఆంధ్రులు సయితము గౌరవంగా తమ యభివృద్ధిని కోరుతున్నారు. ఈ పరిస్థితులలో ఆంధ్రుల త్యాగపూరితమైన దీక్ష, అచంచలమైన కృషి మాత్రమే రాష్ట్రమును సాధించగలవు. తాము ఆత్మ విరుద్ధంగా చేయబోయే పొరబాట్ల ఫలితాన్ని వారుకాక వారి పుత్ర పౌత్రాదులుకూడ ననుభవించవలసివచ్చును. కాబట్టి యీ సమస్యావిషయంలో ఆత్మపరీక్ష చాల ముఖ్యమైనది.

రాయలసీమ వాసులకు రాష్ట్ర నిర్మాణ సందర్భమున కొన్ని అనుమాన భయాలున్నవి. అందుకు ఉత్తర సర్కారు జిల్లాలవారు వారి యెడల అనుసరించిన ఉదాసీనత, నిర్లక్ష్యభావాలే కారణం. కాని ఒకేభాష, ఒకే ఆచార వ్యవహారములు కలవారితో కలసి సాధించలేని అవకాశాలను, హక్కులను అన్యులతో కలసి సాధించగలమని రాయలసీమవారు తలచడం భ్రమ. మన రాజ్యాంగములో తమ న్యాయమైన హక్కులను, అవకాశములను సాధించుకొనుటకు వసతులు మెండుగానున్నవి. రాయలసీమవారు ఉత్తర సర్కారులవారి దయానుగ్రహాలకు ఎదురు చూడవలసిన అవసరంలేదు. ఉత్తర సర్కారు జిల్లాలవారు సయితము తామింతవరకు అనుసరించిన వైఖరికి పశ్చాత్తాపపడి రాయలసీమ వాసుల భయానుమానముల కవకాశము లేదని ప్రకటించి తమ సానుభూతి సహకారాలను వాగ్దానంచేసి నమ్మకం కలిగించాలి. అందరు సమైక్యతగా సమర్థమైన నాయకత్వముక్రింద రాష్ట్ర నిర్మాణమునకు కృషిచేయాలి.

ఇక మద్రాసు నగరసమస్య తేటతెల్లమైనది. చారిత్రాత్మకంగా మద్రాసు తెలుగువారిది. అనాదినుండి తెలుగువారికి నివాసస్థానము. నగర నిర్మాణమునకు, అభివృద్ధికి ఆంధ్రులకృషి, ధనము, ప్రభుత్వఆదాయము విశేషముగా వెచ్చించబడింది.

ప్రస్తుతపు ఆంధ్రుల జనాభా సయితము ప్రభుత్వము తయారుచేసిన లెక్కలు చూపు దాని కంటె ఎక్కువగానే యున్నదనుటకు ఆధారములు చాలయున్నవి. అంటే తమిళులతో యించుమించుగా సరిసమానమైన ఆంధ్రజనాభా యున్నది. ఈపరిస్థితులలో ఆంధ్రులు మద్రాసులో భాగం కోరడం న్యాయసమ్మతమైనది. కాబట్టి మద్రాసు తమిళులకు ఆంధ్రులకు విభజించబడాలి. లేదా తమిళులు, ఆంధ్రులు, కన్నడులు, మలయాళీలు మొదలగు వారందరు నివసించుచుండుటచేత ఉమ్మడి నగరంగా కమీషనరు పరిపాలనక్రిందనైన ప్రకటించబడాలి. ఈ రెండు మార్గాలకు మించినదేదియు ఆంధ్రులకు గౌరవప్రదమైనది కాదు. ఇదే యభిప్రాయాన్నే ఆంధ్ర ప్రజానీకం రాయలసీమవాసులతో సహా ప్రకటిస్తున్నది.

'సిసి'

—(o)—

## గృహలక్ష్మి



చీమలపాటి
సూర్యనారాయణగారు

స్త్రీరత్నములనంగ : సృష్టి స్థితి లయముల్, సమకూర్చు దివ్యమహా శక్తి యుతలు!
వంశమర్యాదయు ప్రఖ్యాతివెలయంగ; చేయుచక్కని నేర్పు స్త్రీలకుండు!
గృహమును చక్కగఁ గీలించిదిద్దుచు, గృహలక్ష్ములనఁగ చెల్లు గృహిణులెపుడు
దయయు దాక్షిణ్యంబు తనరారు లోకముల్, కాపాడు శక్తులు కాంతలెపుడు!

సహనముక్షమయున్ బుద్ధి చాలఁగలిగి పురుషశక్తితోడయి, పొదలునట్టి,
స్త్రీలు లోకాన ఘనులనన్ చెల్లకున్నె? వనితలేనట్టి గృహమెల్ల వగలు చెందు!

గరితల్ చదువునేర్చి ధరణిలోన సత్యంబు, శౌచంబు; ధర్మంబు; శాంత ముఖ్య
సద్గుణ రాసులన్ సతతంబు నాత్మీయ సంతతికి నేర్పుచు సాకఁగలరు!
నీతిపథమునందు నేర్పున త్రిప్పుచు, బాలురఁ బ్రోవుచు, ప్రభలఁగలరు!
వీరధర్మము మెప్పి, గౌరవంబొప్పార, దేశరక్షణశక్తిఁ దెలుపఁగలరు!

పలుకవలె సత్యమీవేళ పరమనీతు! పలుకులెందె దేవతటను బొంకఁగల్గునేమొ?
అంచు, నేవేళ భీతితో సంచరించి, మెలఁగువనితయే గృహలక్ష్మి వెలయఁగార!

భువినిపతిభక్తి వనితకు ముక్తియనుచు, మనమున తలంచి పతితోడ మసలవలయు!
భవ్యసతి గృహలక్ష్మి నాఁబరగుచుండు! సాటిలేరిక వనితకు సాటి ఇలను!

# రష్యన్ నృత్య నాటక కళ

ప్రపంచంలో రష్యన్ నృత్యనాటకకళ (బేలట్) అతిశ్రేష్ఠమైనదనీ, దాని అభివృద్ధికీ, బోల్షోయ్ థియేటర్‌కీ సన్నిహిత సంబంధముందనీ పరిగణింపబడుతూంది.

పురాతన నృత్యనాటకకళ, స్పష్టమైన జాతీయ స్వభావానికీ, ప్రజలతో దానికిగల సన్నిహిత సంబంధానికీ, వాస్తవికతకూ ప్రసిద్ధి పొందింది. బోల్షోయ్ థియేటర్‌కు చెందిన ప్రప్రథమ రష్యన్ నర్తకులు కూడా రష్యన్ ఇతివృత్తాలనూ, రష్యన్ నాట్య పద్ధతులనూ మేలంగా పరిగణించేరు. ఆ రోజుల్లో ఫ్రెంచి, ఇటాలియన్ నృత్య నాటక కళాచార్యులచే ప్రదర్శింపబడిన నృత్యనాటకాలలోకూడా రష్యన్ నర్తకీ నర్తకులు ధైర్యంతో, నిష్కాపట్యంతో జానపద నృత్యాలనే ప్రదర్శించేరు.

మనోహరమైన రష్యన్ జానపద నృత్యానికి గంభీరమైన నిరాడంబరత, మృదుత్వము ముఖ్యలక్షణాలు. ఈ జానపద నృత్యకళా ప్రభావంవల్లనే రష్యన్ నృత్యనాటక వాస్తవిక కళ ఒక స్వరూపాన్ని పొంది, పూర్ణత్వాన్ని అందుకుంది.

ప్రఖ్యాత రష్యన్ సంగీత విద్వాంసులలో కొందరు నృత్య సంగీతాన్ని సృష్టించడానికి చేసిన ఫలవంతమైన కృషికూడా రష్యన్ బృందగాన నృత్యకళా వికాసానికి తోడ్పడింది. నయినా రచించిన "మంత్రవిద్య" నాటకంలోనూ గ్లింకారచించిన "రుస్లాన్ అండ్ ల్యూడ్మిలా" అనే గేయనాటకంలోనూ, ఆతని "ఇవాన్ సుసానిన్" నాటకంలోనూగల అద్భుత నృత్యాలు మానృత్యనాటక కళాచార్యులకూ, నర్తకులకూ సువిశాల సృజనాత్మకమైన అవకాశాన్ని కలిగించేయి. బొరొడిన్, ముస్సోర్గ్‌స్కీ, రిమ్‌స్కీ, కోర్సకోవ్ తదితర రష్యన్ సంగీత విద్వాంసులు రచించిన గేయనాటకాలలో చాల నృత్యసంగీతముంది.

ఛయికోవ్‌స్కీ రచించిన "స్వాన్ లేక్," "స్లీపింగ్ బ్యూటీ," "నట్‌క్రేకర్" అనే నృత్యనాటకాలలోని గీతాలకుకూడా నృత్యనాటక కళాభివృద్ధిలో గొప్ప ప్రాముఖ్యతవుంది.

బోల్షోయ్ థియేటరు కోరికమీదనే ఛయికోవ్‌స్కీ తన మొదటి నృత్యనాటకం "స్వాన్ లేక్" రచించేడు; అది మొదటిసారి 1877 ఫిబ్రవరి 20-వ తేదీన ప్రదర్శింపబడింది. కాని నృత్యనాటక కళాచార్యుడు రీసింగర్ యీ యుత్కృష్ట రష్యన్ కళాఖండంలోని కవితా శక్తిని గ్రహించనూ లేదు, అర్థం చేసుకోనూ లేదు. "స్వాన్ లేక్" మళ్లీ 20 ఏళ్ల తరవాత పునర్జీవింపబడింది; అప్పటినుండి ప్రపంచ నృత్యనాటకశాలల కార్యక్రమాలలో అది ఒక అంశమైంది. రష్యన్ నృత్యనాటక కళాచార్యుడు ఎ. గోర్‌స్కీ దానిని మాస్కోలో ప్రదర్శింపజేసి, ఎల్. ఇవనోవ్, ఎమ్. పెటిపాలచేత నిర్వహింపబడిన హంస నృత్యాల అద్భుత సమ్మేళనాల విశిష్టతను పోషించేడు.

ఛయికోవ్‌స్కీ, ఎంగ్లజునోవ్ రచించిన నృత్యనాటక రచనలలోగల కవితామాధుర్యమూ, అవ్యాజమైన వుద్రేకమూ ప్రసిద్ధ నృత్య నాటక కళాచార్యుల, ప్రదర్శకుల దృష్టి నాకర్షించేయి; అవి రష్యన్ పురాతన నృత్యనాటక కళా వికాసంలో ఒక నూత్నదశను సూచించేయి.

# రష్యన్ నృత్యనాటక కళ

సోవియట్ పరిపాలనా కాలంలో గ్లియిర్, ప్రొకొఫ్లీవ్, వాసిలెంకో, అసఫీవ్, తదితర ప్రఖ్యాత సంగీత రచన కళా కోవిదులు నూతన నృత్యం నాటకాలను సృష్టించడంలో ఫలవంతమైన కృషిచేశారు.

నృత్యనాటక కళలో బోల్షోయ్ థియేటర్ నిర్వివాదమైన జయము సాధించినప్పటికీ, చాల కాలం వరకూ యీకళ కొద్దిమంది ప్రజలకు మాత్రమే అందుబాటులో వుండేది.

ఇందువలన ప్రదర్శన కార్యక్రమాలకు దెబ్బతగిలింది. నాటకాచార్యులకూ నర్తకులకూ సృజనాత్మక అవకాశాలు సన్నగిల్లేయి.

అక్టోబరు సామ్యవాద మహావిప్లవం మాత్రమే నృత్యనాటక కళ ప్రజాకళగా రూపొందడానికి నిజమైన అవకాశాలిచ్చింది.

విప్లవానంతరం బోల్షోయ్ థియేటర్ ప్రదర్శించిన ప్రప్రథమ నృత్యనాటకాలను కార్మికులు, ఎర్రసైనికులు అమితోత్సాహంతో హర్షించేరు. అదివొక కష్టదశ; అంతర్యుద్ధం యింకా సాగుతూనే వుంది; కాని బోల్షోయ్ థియేటరు ప్రేక్షకులతో కిటకిటలాడుతూ నిండిపోయింది; ప్రేక్షకులు హర్ష ధ్వనులతో మమ్మలను ఉద్రిక్తులను చేశారు. రష్యన్ కళా సాంస్కృతిక విజయాలన్నిటికీ వారసులైన కార్మిక ప్రేక్షకులు రష్యన్ పురాతనపు నృత్యనాటక సంపదను వెంటనే అభినందించేరు.

నాట్యకత్తెలమైన మాకు కార్మికుల, ఎర్రసైనికుల క్లబ్బులనుండి వారికోరకు ప్రదర్శనాలిమ్మని ఆహ్వానాలు వస్తూ వుండేవి.

ఆకాలంలో సోవియట్ రిపబ్లిక్ విదేశ, స్వదేశ శత్రువులతో పోరాడుతూంది; తాను అతికష్ట దశలో వున్నప్పటికీ సోవియట్ ప్రభుత్వం బోల్షోయ్ థియేటర్ పట్ల అత్యంత శ్రద్ధాసక్తులను చూపింది. గేయనాటక నృత్యనాటక కళలు వాస్తవిక కళా పంథాననుసరించడానికీ, ఈకళల విశిష్టతను కాపాడడానికీ, పెంపొందించడానికీ, ప్రజలకు సన్నిహితంగా చేయడానికి ప్రభుత్వం ఎంతో తోడ్పడింది.

1920-30 దశలో బోల్షోయ్ థియేటర్, విప్లవ పూర్వక కాలంనుండీ సాంప్రదాయసిద్ధంగా వచ్చిన పురాతన నృత్య నాటకాలను ప్రదర్శించింది. కాని కొత్త నృత్యనాటకాలను ప్రదర్శించాలని మేమంతా కలలుగన్నాము. అధునిక ఇతివృత్తంతో కూడిన మొట్టమొదటి సోవియట్ నృత్య నాటకమైన "రెడ్ పాప్పీ"ని కళాకారుడు మిఖేయిల్ కురిలోక్కొ సృష్టించేడు. సంగీత విద్వాంసుండైన గ్లియిరీ అమితోత్సాహంగా దానికి సంగీతాన్ని రచించాడు. చైనా ప్రజల స్వాతంత్ర్యోద్యమం గురించి రచింపబడిన యీ నృత్యనాటకం సమిష్టి కృషిమీదనే ప్రదర్శింపబడింది. ఈనాటకానికి సంబంధించి ప్రధాన పాత్రల నటన గూర్చి, తెరలు, దుస్తుల గురించీ మేము బాగా చర్చించాము. నృత్యనాటక కళాచార్యులైనవి. టిఖామిరోవ్, ఎల్. లాస్చిలిన్ల అద్వర్యంక్రింద యీ ప్రదర్శనం జరిగింది.

ఈప్రదర్శనం అఖండ విజయం పొందింది. ప్రేక్షకుల అభివందనాల నందుకుంది; మేము ఆనందంతో ఉప్పొంగిపోయాము.

నూతన నృత్యనాటకాలకు బోల్షోయ్ థియేటర్ ఎల్లప్పుడూ అత్యధిక ప్రాముఖ్యతను చూపుతూ వచ్చింది. పురాతన రష్యన్ నృత్య నాటకసాంప్రదాయాలలోని విశిష్టతను పోషించుకుంటూ మాథియేటర్ ప్రధాన నిర్వాహకులూ, నర్తకీ నర్తకులు, నృత్యనాటక కళ వికశించాలంటే మాదశలోని వీరత్వాన్ని ప్రతిబింబించే నూతన కళా ప్రదర్శనాలు సృష్టింపబడాలని స్పష్టంగా గుర్తించారు. 1930-40 మధ్య అనేక

కొత్త నృత్యనాటకాలు ప్రదర్శింపబడ్డాయి; వాటిలో బి. అసఫియేవ్ రచించిన "పేరిస్ మంటలు" కూడా వుంది. ఈనృత్య నాటకంలో నాయకుడు స్వాతంత్ర్య పోరాటం సలిపే ఒక ప్రజానీకం. వాసిలీ వయినోనెన్ నిర్వహించిన ప్రదర్శనంలోని తత్వపోకడ ప్రేక్షకుల శ్రేయస్సుకు అనుగుణమైంది.

సోవియట్ నృత్యనాటకాలలో నృత్యం గంభీరభావ పూరితమైంది; అది లోతైన మానవోద్రేకాలను వ్యక్తపరుస్తుంది.

ప్రఖ్యాత జాతీయ, ప్రపంచ సారస్వత గ్రంథాలనుండి ఇతివృత్తాలను తీసుకొని రష్యన్ నృత్యనాటక కళ మరింత పెంపొందింది. రష్యన్ మహాకవి పుష్కిన్ రచించిన "దిఫౌంటెన్ బాక్సిసరాయ్" "దికకేషియన్ ప్రిజనర్" "లేడీరస్సిక్" "బ్రాంజ్ హార్స్‌మెన్" పద్యకావ్యాల నాధారంగా చేసుకుని తయారుచేసిన నృత్య నాటకాలను బోల్షోయ్ థియేటర్ ప్రదర్శించింది. గోగోల్ రచించిన "తారాస్ బుల్బా" షేక్స్పియర్ రచించిన "రోమియో అండ్ జూలియట్" రచనలపై నాధారపడిన నృత్యనాటకాలను అది ప్రదర్శించింది.

వివిధ జాతులుగల సోవియట్ దేశంలోవున్న జానపద నృత్య కళాసంపదనంతటినీ దగ్గరకు తీసుకుని బోల్షోయ్ థియేటర్ సోవియట్ దశలో నృత్యనాటక నూతన కళాశిఖరాల నందుకుంది.

బోల్షోయ్ థియేటర్ కళాకారులూ, మలే, కిరు థియేటర్లవంటి యితర ప్రసిద్ధ థియేటర్లకు చెందిన కళాకారుల మధ్యగల సన్నిహిత సృజనాత్మక స్నేహబాంధవ్యం రష్యన్ నృత్య నాటకకళ యొక్క వాస్తవికతా సాంప్రదాయాల అభివృద్ధికి ఎంతో తోడ్పడింది. స్టానిస్లావ్‌స్కీ వాస్తవికతా నటనా సిద్ధాంతం ప్రభావం మానృత్య నాటక కళాచార్యుల, నర్తకుల కళమీద పడింది.

సోవియట్ పరిపాలనా కాలంలో నృత్యనాటక కళాచార్యులైన ఆర్. జఖరోవ్, ఎల్. లావ్‌లోవ్‌స్కీ, వి. వైనొనెన్‌ల కళాప్రతిభ బోల్షోయ్ థియేటర్ వెల్లడైంది; పెంపొందింది.

ప్రజలలో ప్రసిద్ధిపొందిన బోల్షోయ్ థియేటర్ నర్తకీ నర్తకులైన గాలినాయులనోవా, ఓల్గాలెపిషిస్కాయా, మారినా సెమ్యనోవా అలెగ్జ ఎర్మలయేవ్ తదితరులు సోవియట్ నృత్యనాటక కళకు ఆణిముత్యాల వంటివారు. వీరంతా సాంకేతిక ప్రవీణత, నిరాడంబరత, గొప్ప నటనా నైపుణ్యాలతో కూడిన నృత్య కళాకోవిదులు.

గత పదేళ్లలో ప్రతిభావంతులైన నర్తకీ నర్తకుల కొత్తసంతతి బయలుదేరింది; వీరిలో ఐ. టిఖొమిర్నోవా, ఎస్. గొలొవ్‌కినా, ఎమ్. బొగొల్యుబ్‌స్కాయా, జి. పెట్రోవా, ఎన్. ఛొరొకోవా, ఎమ్. చెర్కాసోవా, ఎమ్. ప్లిసెట్‌స్కాయా, ఆర్. స్ట్రుచ్‌కోవా, వి. ప్రియోబ్రజెన్‌స్కీ, వై. కొండ్రటోవ్, జి. ఫార్మనియాంట్స్ లున్నారు. వీరందరూ ప్రధాన పాత్రలు వహించి విజయవంతులవుతున్నారు.

గంభీరమైన భావ సంపద వాస్తవికత, కళాపరిపూర్ణతలు కలిగి వుండడం వల్ల బోల్షోయ్ థియేటర్ నృత్యనాటకాలు ప్రేక్షకుని మెప్పు బాగా చూరగొంటున్నాయి.

'టాస్' నుండి

# దుర్గపూజ

మూలం :
శ్రీ వసంతకుమార్ చటర్జీ

అనుకరణ :
శ్రీమతి వేదవతీదేవి

[ గృహలక్ష్మి నేర్చుకోవలసినవి గృహోపకరణమయిన విషయాలు మాత్రమే కాదు. భారతదేశం ఆధ్యాత్మిక దేశం. మన వేదాంత విజ్ఞానాన్ని, ఆధ్యాత్మిక విషయాలనూ అర్థంచేసుకోలేక యిప్పటికీ సతమతమవుతూనే యున్నారు పాశ్చాత్యులు. అనాదినుంచీ మన వేదఋషులంతా, తపస్సంతా ధారపోసి కనుగొన్న పరమసత్యాలు - యీ నాడు చాలామందికి పట్టనట్లుతోస్తున్నది. గృహలక్ష్మి ఇంటిపనులన్ని చక్కపెట్టుకొని తీరికసమయంలో మనపురాణగాథలూ, వేదాంతవిషయాలూ తెలుసుకోవటం యుక్తమని నా భావన. ]

భగవంతుని 'శక్తిని' మనం 'దుర్గగా' పూజిస్తున్నాం. భగవంతుడి శక్తికీ, భగవంతుడికీ భేదంలేదు. అగ్నివున్నది. అగ్నికి మండేశక్తివున్నది. అగ్నికీ మంటకూ, భేదంలేదు కదా! భగవంతుడే శక్తి. శక్తే భగవంతుడు. 'శక్తిని' పూజించటం భగవంతుణ్ణి పూజించటమే అవుతుంది.

భగవంతుడు సర్వానికీ అతీతమైనవాడు. అసలు దేవుడు అంటే యేమిటి?— అంటే జవాబు మనం చెప్పడం సులభంకాదు. ఆ దేవుడు యెట్లావుంటాడో, ఆయన గుణగణాలేవో — మనం వూహించుకోలేము. భగవంతుడి తత్వం యేమిటో - అతని ఆకారం యెట్లావుంటుందో, మనకు తెలియకపోయినా, ప్రతినిత్యమూ ప్రపంచంలో జరిగే అనుభవాల్లో, పరిణామాల్లో - భగవంతుడి అతీతమయినశక్తి మనకు ప్రస్ఫుటమవుతూనే వుంటుంది - సూర్యుడు వెలుతురు యిస్తున్నాడు. మేఘాలు వర్షిస్తున్నవి. గాలివీస్తున్నది. సముద్రం నిత్యమూ హోరుపెడుతూనే వున్నది. భగవంతునికంటే, అతని శక్తినే మనం యెక్కువ యెరిగివున్నాము. శివుడు భగవంతుడనీ, దుర్గ అతని భార్య అనీ హిందువుల మతము. శివుడు ప్రపంచానికితండ్రి. దుర్గ తల్లి. తల్లీ తండ్రీ - కలిసి కుటుంబక్షేమాన్ని చూస్తూవుంటారు. అదేవిధంగా - ప్రపంచక్షేమాన్ని - భగవంతుడూ అతని 'శక్తి' - (దుర్గ) కనిపెడుతూ వుంటారు.

'శక్తి' - లేకుండా భగవంతుడూ ఒంటరిగా యెప్పుడూ వుండడు. కనుక అర్ధభాగమైన 'దుర్గ' లేకుండా శివుడు వుండడు, పసిపిల్లవాడు తండ్రి దగ్గరకన్నా తల్లి దగ్గర యెక్కువచనువుగా నుంటాడు. కనుక భగవంతుని కన్నా, అతని 'శక్తి' నే మనం ఎక్కువ యెరిగియున్నాము. కాబట్టి, శివభక్తులకన్నా, దుర్గభక్తులే యెక్కువని అనుకోవటం అతిశయోక్తి కాదు. బెంగాలీలు భగవంతుణ్ణి మాతృస్వరూపంగా యెంచి పూజిస్తూ వుంటారు. బెంగాలులో యెక్కువ దుర్గాపూజ చేయుటంవల్ల నైతేనేమి, 'రామకృష్ణ పరమహంస' - మొదలైన సాధు సాంగత్యంవల్ల నైతేనేమి - ఈనాడు భగవంతుణ్ణి మాతృమూర్తిగా భావించి ప్రార్థనచేయటం ఆచారంగావున్నది.

భగవంతుని శక్తికి 'దుర్గ' అనీ - 'కాళి' అనీ రెండు పేర్లు. 'దుర్గ' అనేపేరుతో జగత్ప్రసిద్ధమైన శక్తే - ఒకప్పుడు కాళికారూపం ధరించినది. మహాకాలుని భార్య కాళి. ప్రపంచాన్ని వినాశంచేయటానికి భగవంతుడు 'మహాకాలుడు' — అయినాడు. 'కాలము' —ప్రపంచంలోని వస్తుజాలాన్నంతటినీ నాశనంచేస్తుంది. భగవద్గీతలో కృష్ణుడు అర్జునుడికి తన విశ్వస్వరూపం చూపించి - 'ప్రపంచాన్ని, ప్రపంచంలోని సర్వజీవులనూ లయం చేశే కాలాన్ని నేను' - అన్నాడు. లోకాన్ని విలయంచేసే భగవంతుని శక్తే 'కాళి', కనుకనే కాళీస్వరూపం ప్రళయ భీకరమైనదీ, విలయకారక మైనదీనీ. కాళి స్మశాన వాటికలో భయంకరంగా నుంచుని వుంటుంది. మెడచుట్టూ పుఱ్ఱెలహారం. ఒక చేతిలో గండ్రగొడ్డలీ, రెండో చేతిలో మనుష్యుడిపుఱ్ఱె - కనిపిస్తూ వుంటాయి. భయంకరమైన సింహం కాళి ఆసనం. అంతభీకరమైన కాళీ మూర్తిలోనూ - యేదోప్రజోప కరణమయిన దీక్షా, దయా - తాండవిస్తూనే వుంటాయి. కనుకనే కాళికాదేవి మిగిలిన రెండు హస్తాలూ, అభయాన్ని యిచ్చే భంగిమలో వుంటాయి. క్రోధంతో ప్రళయ తాండవం చేశే ఆమె ముఖంలో ఒక చిఱునవ్వు అనిర్వచనమైన, భీకరమైన స్మశానవాటికకు ఆమె చిఱునవ్వే వెలుగు. కాళీమాత ఆ చిఱునవ్వులోనే తనబిడ్డలకు అభయహస్తం యిచ్చి నట్లుంటుంది - 'ఓపిచ్చి నాయనల్లారా! మృత్యువుకు అంత వెరుస్తారెందుకు? మృత్యువు శరీరాన్ని నాశనంచేస్తుంది. కాని ఆత్మను యేమీ చేయలేదు. శరీరం నాశనం అయి నప్పుడు ఆత్మకు యింకో శరీరం దొరుకుతుంది'. - అని వెలుగెత్తి చాటు తున్నట్లుంటుంది.

దుర్గ రెండుసార్లు జన్మించినది. ఒకసారి దక్షుని కూతురు 'సతి' గాను - రెండోసారి హిమగిరి పుత్రిక పార్వతిగానూ. దక్షునికి కుమార్తెగా జన్మించిన శక్తి పరిపూర్ణత్వం పొందటానికి - సత్యమయినదీ, విశుద్ధమైనదీ అయిన శివస్వరూపం కావాలి. ఈనాడు

పాశ్చాత్యులకు జ్ఞానమున్నది. కార్యకుశలత్వం వున్నది. కాని ఆ నేర్పరితనాన్నీ, తెలివినీ- వారు 'శివుని' - లేక పరమాత్మను తెలుసుకోవటానికి వినియోగించటం లేదు. శరీర సౌఖ్యాలకోసం కృత్రిమమైన- విధానాలు కనిపెట్టటంలో వారా తెలివిని ప్రయోగిస్తున్నారు. కనుకనే యీ నాటి విశేష పరిజ్ఞానంవల్ల పశ్చిమదేశాలు ప్రపంచంలో శాంతినీ, మంచినీ' - సృష్టించకపోగా 'చెడు'గును స్థాపిస్తున్నవి. దక్షుడి కుమార్తె అయిన 'సతి' శివసమాగంతో పరిపూర్ణత్వము పొందినది. దక్షుడు తనకు శివుడు ప్రణామం చేయాలని కోరినాడు. కోరిక నెరవేరలేదు. దక్షునకు కోపంవచ్చినది. చివరకు శివుణ్ణి పరాభవించి తానే నాశనమైనాడు. 'సతి' - ఆ శరీరంవిడచి హిమాలయునకు కుమార్తెగా జన్మించినది. పార్వతి తనశరీర సౌందర్యంతో హావ భావాలతో పరమశివుణ్ణి కదలించలేక పోయినది. శరీరమే కాకుండా, తనహృదయాంకూడా సౌందర్యమయంగా చేసుకోవటానికి పార్వతి శివశుశ్రూష చేసినది. శివుడు పార్వతిని చేపట్టినాడు.

దుర్గ - విగ్రహానికి పదిచేతులు. పదిచేతుల్లోనూ పది ఆయుధాలున్నవి. ఈ ఆయుధాలతోనే దుర్గ దుష్టసంహారం చేస్తుంది. దేవతలకూ, దుష్టులయిన రాక్షసులకూ యుద్ధం అనాదినుంచీ సాగుతూనేయున్నది. దేవతలశక్తి శాస్త్రాల్లో 'ధర్మం' గా నిర్వచించబడినది. రాక్షసబలమే 'అధర్మము'. మానవుడు ధర్మమార్గాన నడవటంకంటే కృత్రిమమైన ప్రపంచానుభవాలూ, క్షణికసుఖాలూ అంటే ముందంజవేస్తాడు. అందువల్లనే ప్రతియుద్ధంలోనూ రాక్షసపక్షమయిన 'అధర్మమే' గెలుస్తున్నది. సర్వసాక్షీ, ధర్మమూర్తి అయిన భగవంతుడు దేవతలకు సహాయంచేసి ధర్మాన్ని పరిరక్షిస్తూ వుంటాడు. ధర్మపక్షమే జయిస్తుంది.

ఒకసారి రాక్షసులను దేవతలు జయించారు. కాని భగవంతుని బలీయమైన శక్తివల్లనే తాము జయం పొందినామని మరిచిపోయినారు. పరమాత్ముడు యక్షరూపంతో దేవతల దగ్గరకువచ్చి అగ్నినిచూచి 'నీశక్తియేమిటి'? - అని ప్రశ్నించినాడు. తడుముకోకుండా అగ్ని జవాబిచ్చినాడు - 'నేను అగ్నిని. ప్రపంచం అంతటినీ భస్మం చేయగలను;' - బ్రహ్మదేముడు ఒక గడ్డిపోచను అగ్నిముందు పెట్టి - 'దీన్ని భస్మంచేయి చూదాము' - అన్నాడు. అగ్నిదేవుడు తన శక్తిఅంతా ధారపోసి ప్రయత్నించాడు. గడ్డిపోచ కాలలేదు. వాయువు ప్రయత్నంచేసి చూచాడు. గడ్డిపోచ ఆ స్థలంనుంచీ కదలలేదు. ఇంద్రుడు విస్తుపోయి బ్రహ్మదగ్గరకు వెళ్లినాడు. బ్రహ్మ అంతర్ధానమై, ఆ స్థలంలో హిమాలయుని కూతురు 'ఉమ' మెరిసిపోతూ నుంచున్నది. ఉమ యింద్రుడితో అన్నది. 'ఈ యక్షుడే బ్రహ్మ. అతని శక్తివల్లనే పోరాటంలో గెలిచావు నీవు?

హిమగిరి పుత్రిక దుర్గ భగవంతుని శక్తే. ఇంద్రుడూ, వాయువూ, వరుణుడూ — యీ సంగతి మరిచి పోయినారు. (కేనోపనిషత్తు)

మార్కండేయ పురాణంలో దుర్గాపూజను గురించి యున్నది దుర్గ యెట్లా పుట్టినది? - దేవతలు రాక్షసులకు ఓడిపోయి, విష్ణుమూర్తి దగ్గరకూ, శివుడి వద్దకూ వెళ్లినారు. బ్రహ్మ, విష్ణు మహేశ్వరుల శరీరాల్లోనుంచీ వింతకాంతులు వెలువడినవి. కాంతులన్నీ యేకమై, శక్తి పూరితమైన స్త్రీ స్వరూపంగా మారినవి. ఈ స్త్రీ మూర్తే దుర్గ. దుర్గకు దేవతలంతా తమ ఆయుధాలు యిచ్చినారు. దుర్గ రాక్షసులందరినీ నాశనంచేసి వాళ్ల నాయకుడైన మహిషాసురుని మీదకు పోయినది. దుర్గ రాక్షసుడి మీద కాలువేసి అణచిపెట్టినది. రాక్షసుడు తాళలేక బైటికి వస్తూండగానే మహిషాసురుని కంఠం కత్తిరించినది దుర్గ. దేవతలందరూ ఆనందంతో దుర్గను అభినుతించారు.

ఈ కథకు ఆధ్యాత్మిక తత్వం చాల సుందరమైనది. క్రోధమూ, క్రూరత్వమూ, వాంఛా - ఇవి మనశరీరంలో నివసించే రాక్షసులు. ఈ మహాకారాలను త్రెంచుకొని ధర్మమార్గాన నడవాలి అంటే భగవంతుని 'శక్తి' సహాయమూ, కావాలి. క్రోధమూ కోరికా, - యీ అధర్మాలన్నీ, పరమాత్మను తెలుసుకోవటానికి మనకు నిత్యమూ అడ్డు పడుతూనేవుంటవి. భగవంతుణ్ణి అచంచలమైన భక్తితో మనం ప్రార్థిస్తే, అతని 'శక్తి' సహాయంవల్ల మనం యీ అధర్మాన్ని సులభంగా యెదుర్కోగలము.

———(o)———

# ప్రబోధమంజరి

శ్రీమంత మైధరా సీమంతినికిని
హారాగ్రరత్నమై యలరారునట్టి
భారతావనిలోన ప్రభవించినావు
భారతపుత్ర! నీభాగ్యమేమందు
నీ హరిశ్చంద్రుని నిరుపమానంపు
సత్యవాక్పాలనా సాంప్రదాయంబు
విశ్వసారస్వత వీధులయందుఁ
గాగడావేసినఁ గనరాదోయి!
బలికర్ణ శిబిదధీచులఁ బోలునట్టి
యౌదార్యనిధుల విఖ్యాత చారిత్ర
మవనిలోఁగలయట్టి యన్యదేశముల
గాలించి వెదకినఁ గానలేమోయి!
పంచతంత్రమునకుఁ బ్రతివచ్చునట్టి
నీతిశాస్త్రంబదే జాతికిఁగలదు?
శ్రీ భర్తృహరి సుభాషితమునకెందు
సాటియౌ విజ్ఞాన చంద్రికకలదు?
నీ వేదరాశికి నిఖిలదేశములు
చేతులు జోడించి జోతలిచ్చినవి,
నీ భగవద్గీత నిఖిలదేశములు
తలలఁ బూదండ చందమునఁ దాల్చినవి,
పరయహింసా మహాపరమ ధర్మంబు
విశ్వమానవలోక విమల సౌభ్రాత్ర
ధర్మంబు దేశాలఁ దనివిబోధించి
జగదేక సద్గురు స్థానంబుఁగొనిన
బుధలోకనుతుఁడైన బుద్ధదేవుండు
నీ తల్లి కడుపున నిండారమోచి
కన్నట్టి తొలిపట్టి కాఁడా; కుమార!
ఆ మహామహితుని యడుగుజాడలను
జీవయాత్రనుచేసి చిరకీర్తిఁగాంచి
శాంత్యహింసా ధర్మ సాంప్రదాయములు
జగతికి బోధించి చాటినఘనుండు
గాంధిదేవుండు సత్కారుణాంబురాశి
నీమాత గర్భాన నిండారమోచి
కన్నట్టిమలిపట్టి కాఁడా; కుమారా!
నీసాంప్రదాయము నిరుపమానంబు
నీభాగధేయము శోభావహంబు
శాంత్యహింసాదయా సత్యసంపదల
శాంతివీరుండవై జాతిగౌరవము
దేశగౌరవము దిగ్దేశాలఁజాటి
వర్ధిల్లు భారతవర వీరపుత్రా!

చింతలపూడి సన్యాసిరావు

# గాంధీగారి జీవితములోని ముఖ్యాంశములు-వాటికాలములు

2.10-1869. జననము.

1883. వివాహం.

1885. తండ్రిమరణం.

1888. లో జ్యేష్ఠపుత్రుని జననం, విద్యకు ఇంగ్లండు ప్రయాణం.

1891. బారిష్టరై మరల వచ్చుట.

1893. మొదటిసారి దక్షిణాఫ్రికాకు ప్రయాణం.

1894. అబ్దుల్లా కేసురాజీ; తెలపన్ను బిల్లు, నేటాలులో సత్యాగ్రహారంభం, నేటాలు యిండియన్ కాంగ్రెస్ స్థాపన.

1896. భారతదేశమందు ప్రచారము.

1897. భారతదేశపు క్షామనిధికి సొమ్ము వసూలు.

1899. బోయరు యుద్ధములో చికిత్స, సేవ.

1901. భారతదేశమందు మరల ప్రచారము; కలకత్తా కాంగ్రెస్‌లో పాల్గొనుట.

1903. ట్రాన్సువాలులో సొలిసిటరు వృత్తి.

1904. ఇండియన్ ఒపినియను, పత్రికస్థాపన, ఆస్తి స్వత్వం వదులుకొనుట.

1906. ట్రాన్సువాలులో మొదటి సత్యాగ్రహము, జూలూ యుద్ధములో సేవ, బ్రహ్మచర్య వ్రతారంభం, లండనులో ప్రచారం, సమిష్టి సత్యాగ్రహం.

1907. ప్రాక్టీసు మానుట - పూర్ణత్యాగం.

1908. మొదటి జైలుయాత్ర, రాజీమోసం, మరల సత్యాగ్రహం, జైలు.

1909. ఇంగ్లండుకు రాయభారము; హింద్ స్వరాజ్ రచన, టాల్‌స్టాయి లేఖలు.



1913. మరల సత్యాగ్రహము జైలు.

1914. ఉపవాసం, రాజీ, అక్రమపు చట్టాలరద్దు.

1915. భారతదేశమున ప్రవేశము, టాగూరు, గాంధీని మహాత్ముడనుట, సబర్మతీ ఆశ్రమ స్థాపన, దేశసంచారారంభం.

1916. హిందూ విశ్వ విద్యాలయ ప్రారంభోపన్యాసము, యంగిండియా, నవజీవన పత్రికల ఆరంభము.

1917. చంపారణ సత్యాగ్రహము. గ్రామసేవ. కాంగ్రెసు లీగు ప్రణాళిక (నవంబరు) గుజరాతు రాజకీయసభ కధ్యక్షత, (డిశంబరు) సంఘసేవా సభకధ్యక్షత.

1918. (మార్చి, అహమ్మదాబాదు మిల్లు సత్యాగ్రహము, ఖేరా సత్యాగ్రహము; దక్షిణ భారతములో హిందీప్రచారము; ప్రారంభము; అస్వస్థత.

1919. రౌలతు చట్టం; పంజాబు దుర్ఘటన; సత్యాగ్రహ సభ స్థాపన; యంగు ఇండియా నవజీవన్ సంపాదకత్వము. పంజాబు అల్లరి గూర్చి గాంధీగారి రిపోర్టు ఖిలాఫతు మహా సభ కధ్యక్షత.

1920. సర్కారు పతకాల విసర్జన: హోంరూలు సభాధ్యక్షత, కలకత్తా నాగపూరు మహా సభలలో అసహాయోద్యమ తీర్మానాలు, కాంగ్రెసుకు కొత్తరాజ్యాంగం. గుజరాత్ విద్యాపీఠాదులు స్థాపన.

1921. అసహాయోద్యమ విజృంభణ, బెజవాడలో నిర్మాణ కార్యప్రకియ తీర్మానం, అహ

మ్మదాబాదు కాంగ్రెసు, త్రివిధ బహిష్కారం, సత్యాగ్రహ నియంతృత్వం.

1922. సాంఘిక సహకారసభ (బొంబాయి;) పన్నుల నిరాకరణ యత్నము; చౌరి చౌరా అల్లరి; సత్యాగ్రహపు నిల్పుదల; కేసు, శిక్ష; యరవాడజైలు.

1923. జైలులో సౌకర్యాలు వదలుట; కాకినాడ కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమునకు తోడ్పాటు.

1924. శస్త్రచికిత్స, విడుదల, ముస్లిం కలహాలు, సాంఘిక మైత్రికై 21 రోజులు ఉపవాసం, బెల్గాం కాంగ్రెసు అధ్యక్షత; మరల యంగిండియా, ఆశ్రమవాసుల లోపములకు వారం ఉపవాసం,

1925. చరఖాసంఘపు స్థాపన, కాంగ్రెలో హిందూస్థానీ భాష వాడుటకు కాంగ్రెసు తీర్మానము

1926. చీనాకు సానుభూతి సందేశం.

1927. సింహళాదులయాత్ర;మద్రాసు కాంగ్రెసులో పూర్ణ స్వాతంత్ర్యపు తీర్మానం; గాంధీగారి విమర్శ.

1928. బర్డోలీ సత్యాగ్రహం,కలకత్తా కాంగ్రెసులో, రాజీ తీర్మానం.

1929. ఇర్విసుతో రాయభారం, ఆంధ్ర బర్మా యాత్రలు, లాహోరులో పూర్ణస్వాతంత్ర్యపు తీర్మానం ప్రతిపాదన.

1930. స్వాతంత్ర్య దీక్ష, నియంతృత్వం: ఉప్పు సత్యాగ్రహం; జైలుయాత్ర.

1931. గాంధీ-ఇర్విను సమాఖ్య, లండను సభలో కాంగ్రెసు ప్రతినిధిగా పాల్గొనుట.

1932. మరల నిర్బంధము, సత్యాగ్రహ తీవ్రత; హరిజన సమస్యకు ఉపవాసాలు; హరిజన సేవక సంఘస్థాపన; హరిజన పత్రికారంభం; దేశసంచారం, సేవాగ్రామ ఆశ్రమ స్థాపన.

1934. గ్రామపరిశ్రమ సంఘస్థాపన; కాంగ్రెసు సభ్యత్వమును వదలుకొనుట.

1935. భారతీయ సాహిత్య పరిషత్తు స్థాపన, హిందీ సాహిత్య సమ్మేళనపు అధ్యక్షత, గుజరాతు సాహిత్య సమ్మేళన సభ కధ్యక్షత.

1937. కాంగ్రెసు మంత్రివర్గముల అధికారస్వీకరణ హిందీ సమ్మేళనంలో ఉపన్యాసములు, వార్ధాలో నవ్యవిద్యాసభ, భారతీయ సాహిత్య సభ కధ్యక్షత.

1938. హరిపుర కాంగ్రెసు, ఖాదీ స్వదేశీ ప్రదర్శనము, సరిహద్దు రాష్ట్రంలో సంచారములు.

1939. రాజకోటలో ఉపవాసం, గాంధీ సుభాషుల విభేదం, మహాయుద్ధారంభం, కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామా.

1940. రాయగఢ్ కాంగ్రెసు వ్యక్తి సత్యాగ్రహ ప్రారంభం, వైస్రాయితో సంభాషణలు.

1941. యుద్ధంలో దేశరక్షణ, అహింసా పద్ధతిని గూర్చి కాంగ్రెసుతో భేదాభిప్రాయం, జపాను యుద్ధప్రకటనము.

1942. జమ్నాలాల్ బజాజ్ మరణం, క్రిప్సు రాయభారం కాంగ్రెసులో "క్విట్టిండియా" తీర్మానం, గాంధీ ఇత్యాదుల అరెస్టు, ఆగాఖాను భవనంలో నిర్బంధం, దేశములో అల్లరులు, సర్కారుల నిరంకుశ చర్యలు, మహాదేవ దేశాయి మరణం.

1943. కాంగ్రెసు నిర్దోషిత్వాన్ని గూర్చి లేఖలు. ఉపవాసం (21 రోజులు) మహాక్షామం.

1944. (శివరాత్రి) కస్తూరిబాయి మరణం, May 6 న గాంధీగారి విడుదల, చరఖాసంఘపు నిర్మాణం, జిన్నా గారితో పాకిస్థాన్ గూర్చి దీర్ఘ సంభాషణ, కస్తూర్బా, జాతీయ స్మారక నిధి కధ్యక్షత, జర్మనీ యుద్ధ సమాప్తి.

1945. కాంగ్రెసు నాయకుల విడుదల, సిమ్లా (మొదటి) సంభాషణలు, హరిజనసేవకసమితిలో సంభాషణ, జపాను యుద్ధానంతరము కలకత్తా సోదేపురాశ్రమ యాత్ర.

1946. మద్రాసుకు హిందీప్రచార యాత్ర, రజతజయంతి. బ్రిటీష్ మంత్రిత్రయంతో చర్చలు, May 16 న. రాజ్యాంగ ప్రణాళిక, ఇంటరిం ప్రభుత్వ స్థాపన, కలకత్తా నవఖాలీ, బీహారుల హింసాకాండ, తూర్పు బెంగాల్ యాత్ర.

1947. బీహారుయాత్ర, పంజాబు సరిహద్దు రాష్ట్రాల హింసలు, క్రొత్త వైస్రాయితో సంభాషణలు, ఆసియా మహాసభ, పాకిస్తాన్ హిందుస్తానుల నిర్మాణము, కలకత్తాలో శాంతి స్థాపనము, ఢిల్లీలో, కల్లోలం సద్దుబాటు, కాశ్మీరయుద్ధం.

1949. హిందూ ముస్లిం సఖ్యతకు ఉపవాసం, నిర్యాణం, లోకమంతట విచారం. సర్వోదయ సమాజస్థాపన, రాజ్యాంగ నిర్మాణం.

——(౦)——

# గాంధి తత్వము — "అహింస"

11-6-49 రేడియో ప్రసంగము

ఏ మహదాశయమును, జీవితాశయముగా పాటించి - సర్వస్వమునూ ధారవోసి, తనజీవితకాలమందే అట్టి ఆశయసిద్ధిని, చాలవరకూ పొందెనో! తుదకు ఆ అహింసా సిద్ధాంత వ్యాప్తియందే, తనప్రాణములను, రణమందు వీరస్వర్గమలంకరించిన, శూరునివలె బలియొసగి, అమరత్వమునొందిన, గాంధీజీ ప్రపంచ మంతటనూ, 'శాంతిదూతగా' ఆ కల్పాంతమూ పరిగణింపబడుటకు ఆయన సాధించిన అహింసాతత్వమే కారణము.

గాంధీజీ, సాధించి బోధించిన అహింసాతత్వము క్రొత్త సిద్ధాంతముకాదు. అహింసయే పరమధర్మమని, మహాభారతవాక్యము. క్రైస్తవమతము అహింసాతత్వము మీదనే ఆధారపడియున్నది. జైను బౌద్ధమతాలకు అహింసాసిద్ధాంత మే పట్టుకొమ్మ. ఎన్నదగిన మతములన్నియూ అహింసాతత్వాన్ని ఆమోదించి ఆచరణలో పెట్టమని ప్రభోధించినవేయని చెప్పవచ్చును

అయితే, 'అహింస' అనగా ఎట్టిది? మానవజీవితంలో ఏ విధంగా, ఎంతవరకు ఆచరణలో పెట్టవచ్చును? అహింసాతత్వమందలి అతిశయం ఎట్టిది.? నేటిపరిస్థితులలో ఆహింస తత్వావలంభమునకు తావున్నదా? అనేటటువంటి ప్రశ్నలకు, గాంధీజీ అవలంభించి, భోధించిన అహింసా మార్గములను పరిశీలించి, జవాబులు తెలుసుకుందాం.

మనోవాక్కర్మలచే, జీవముగల ఏ ప్రాణినైననూ హింసించ కుండుటయేగాక, సమస్త జీవరాసులయందునూ అకుంఠితప్రేమతో, సంచరించుట యనునదే అహింసా తత్వము. మానసికములైన, ద్వేషము, అసూయ క్రోధము మొదలైనవికూడ గాంధీజీ సిద్ధాంతప్రకారం, హింసలుగనే భావింపబడినవి. పరుషవాక్యములతో కొరడా దెబ్బల కంటె ఎక్కువగా బాధ కల్పింపవచ్చును. అందుచేతనే, త్రికరణములయందుకూడ ప్రేమకు విరుద్ధమగు హింస ఉండకుండుటయే, అహింస.

ఈ సిద్ధాంతము హైందవమతస్థులకు క్రొత్తది కాకపోయినప్పటికీ, చతుర్విధ పురుషార్థములలో కడపటిదగు మోక్షసాధనకుమాత్రమే, వ్యక్తిగతముగా, ఆముష్మిక చింతతో మనపూర్వులచే అవలంబింపబడుతూ వచ్చినదేకాని, ఐహిక సమస్యలగు సాంఘిక, రాజకీయాది విషయములలో ఎక్కువగా ఆచరణలోనికి తేబడియుండలేదు. మోక్షసాధనకేకాక సమస్త విషయములందునూ అహింసాతత్వముమీద ఆధారపడిన సత్యాన్వేషణయే ఏకైక సాధనమని నిరూపించునవకాశము గాంధీజీ జీవితములో కల్గినది, ఆయనజీవితములో, దక్షిణ ఆఫ్రికా 'మారిజ్‌బర్గు,' స్టేషనువద్ద మొదటితరగతి రైలుపెట్టెనుండి "కూలీలు మొదటితరగతి పెట్టెలలో ప్రయాణమునకు అనర్హులు" అని

క్రిందికీడ్వబడిన దాదిగా జరిగిన వివిధసంఘటనలు అహింసామార్గా వలంభనకు కారణ భూతములైనవని నిస్సంశయముగా చెప్పనచ్చును.

1908 లో గాంధీజీ వ్రాసి ప్రచురించిన "హింద్ స్వరాజ్" అనే మొదటి గ్రంథములో, అహింసాతత్వమును గురించి విపులముగా తెలుపబడియున్నది. భూతదయ అహింసకు ఆయువుపట్టు. భూతదయకు హృదయ పూర్వకమగు ప్రేమ పునాది. ప్రేమయేసర్వము, ప్రేమయేసత్యము, ప్రేమయేనిత్యమగు దైవస్వరూపము. అట్టి ప్రేమను హృదయమందు నెలకొల్పుకొన్నవారికి శత్రువులు, మిత్రులు సమానులే. ద్వేష క్రోధములకు తావుండదు. త్రికరణశుద్ధిగల అహింసయే ప్రేమయొక్క బహిర్గత స్వరూపము - ఈ ప్రేమతత్వమే గాంధీజీచే సాధింపబడిన సత్యాగ్రహ సమరములకు ప్రాణవాయువువంటిది. సర్వజీవుల శ్రేయస్సు అహింసవల్లమాత్రమే సాధింపవీలగును కాని వేరుమార్గములేదు.

గాంధీజీ ఈ విధముగా అహింసాతత్వమును ప్రబోధించి, మొదటి ప్రపంచ యుద్ధమున హిందువులను పాల్గొనమని హెచ్చరించినపుడునూ, ఆశ్రమమున ఆవుదూడ యొక్క మరణబాధను నివారించుటకై దానికి విషమిప్పించి చంపించినప్పుడునూ, పలువురు తీవ్ర విమర్శలు చేయుటకు అవకాశము కల్గినది. ఈ విమర్శలకు సరియగు సమాధానము గాంధీజీ ఇవ్వగలైనా యున్నది, వివాదాంశమగు విషయమగుటచే మనము దాన్ని ప్రస్తుతప్రసంగంలోనికి తీసుకు రాకుండుటయే మంచిది.

ఆశయములకూ ఆచరణకూగల దూరము అన్ని విషయములందువలెనే అహింసా చరణయందుకూడ గోచరముకాక తప్పదని మాత్రము మనముగ్రహించిన చాలును.

హింసాయుతమైన ప్రపంచమందు మానవులము నిస్సహాయులమై హింసజ్వాలలందు చిక్కుబడియుండుటయూ, జీవరాసులు ఒకదానిని మరొకటి చంపి తిని జీవించుటలో మహత్తరమగు అర్థము లేకపోలేదనియు, మానవుడు అనునిమేషమూ తెలిసిగాని తెలియకగాని హింసజరుపుచునే యుండుననియూ, మానవుని నిత్యకృత్యములగు భోజనము, పానము మొదలైనవన్నియూ హింసతో కొంచెముగనో గొప్పగనో, కూడియున్నవనియూ గాంధీజీ గ్రహించకపోలేదు.

మానవ ప్రకృతి మంచిచెడ్డలు రెండింటియొక్క మిళితమన్న విషయముకూడ గుర్తించియే యుండెను. భూతదయవలననూ, ఆత్మనిగ్రహముచేతనూ హింసను సాధ్యమైనంతవరకూ తగ్గించుటకు ప్రయత్నించుటయే అహింసయొక్క లక్ష్యమనిన్నీ, మానవ ప్రకృతియందలి చెడుగును దీక్షతోగూడిన ఆత్మ నిగ్రహమువలన మనము తొలగించవచ్చుననియూ, గాంధీజీయొక్క వాదన. అపకారికి ఉపకారము చేయుటయందలి

ఉత్కృష్టత, తననిత్యనైతిక జీవితమందేగాక మహత్తర రాజకీయ సమస్యలను ఎదుర్కొనుటలోగూడ ఏవిధముగా ఉపయోగించునో నిరూపింపగల్గిన సదవకాశము, గాంధీజీకి దేశకాల పరిస్థితులవల్ల, చిక్కినది.

సంఘ జీవితమందునూ జాతీయ జీవితమందునూ కూడ, సంఘముగాని, జాతిగాని వ్యక్తులు దైనందిన జీవితములో అవలంభించిన రీతిగనే, అహింసను అవలంభించినచో వ్యక్తికిగల్గిన శాంతి భద్రతలు సంఘమునకు, జాతికినీగూడ సమకూరగలవని; దౌర్జన్య రాహిత్యఅసహాయోద్యమమువలన గాంధీజీ నిరూపించగల్గెను. ఏవిధమైన సమస్యయైననూ అహింసామార్గావలంభనచే పరిష్కరింప వచ్చునని ఆచరణాత్మకముగా ఋజువుచెప్పగల్గెను.

ప్రాణమనునది సమస్త జీవరాసులకు ఒక్కటే అనియూ, అట్టి ఏకత్వమునకు ప్రేమయే జీవితన్యాయమనియూ అట్టిప్రేమ నిరంతర సేవవల్లనూ, త్యాగముచేతనూ సమకూడుననియూ గాంధీజీయొక్క ఆదేశము.

అహింసాయుతమైన సత్యాగ్రహము బలీయమైన ఆత్మశక్తిగాని, పిరికిపందలగు నిస్సహాయుల అశక్తి కాదని, మనము గాంధీజీ జీవిత సంఘటనలవల్ల తెలిసికోవలసియున్నది. ఒకలెంపపై కొట్టిన రెండవలెంపమీద కూడా కొట్టమని కోరుటయందలి అహింసామార్గము పిరికితనము సూచించుననే దురభిప్రాయము చాలమందికి కల్గుట సహజము. కాని దీర్ఘముగా ఆలోచించి, నిజతత్వమును గ్రహించిన యెడల అహింసా తత్వమునకు ఆయువుపట్టయిన ప్రేమకుగల అపారమగు శక్తి గోచరించగలదు. ప్రేమతో జయింపరానిదేదియూనుండదు. మహాభీకరములగు మొదటి, రెండవ ప్రపంచ యుద్ధములలో హింసామార్గమున ఏమిజయింపగల్గిరో మనముకనులార చూచియే యున్నాము.

పశుబలముమీద ఆధారపడిన యుద్ధమునకునూ, హృదయమునకు సంబంధించి నైతికశక్తిమీదనూ, ఆత్మశక్తిపైననూ, ఆధారపడిన అహింసాత్మక సత్యాగ్రహ సమరమునకునూ గల తారతమ్యము, నేటి ప్రపంచమంతటికినీ దృగ్గోచర మగుటకునూ, పశుబలోత్కృష్టతయందు క్రమేణా పాశ్చాత్య దేశముల నమ్మకము సన్నగిల్లుటకునూ, ప్రపంచశాంతికై అన్నిదేశములూ ప్రయత్నములు సల్పుచుండుటయూ, గాంధీజీ బోధించి మనదేశములో సాధించిన అహింసాతత్వపు విజయమే కారణమని చెప్పుటకు ఎంతమాత్రమూ సందేహములేదు. ప్రపంచశాంతికి అచిరకాలములో మనగాంధీ తత్వము మార్గదర్శియగు గాక.

"గాంధి అంతరించునుగాని గాంధితత్వము ప్రపంచమున చిరస్థాయిగా నిల్చు"నని గాంధీజీయే కరాచీలో స్వస్తివాక్యము తననోటనే పల్కినపల్కులు వేదాక్షరములు గావా?

—(o)—

సత్తిరాజు సూర్యకాంతమ్మ.

# స్త్రీ అంటే ఎవరు?



శ్రీమతి ఎమ్. సుశీలాదేవి

"ఏయి. మిమ్మల్నే. అబ్బబ్బ. ఏంనిద్రండి. లేవండి."

"ఏమిటే శనిముండల్లా చంపుకు తింటున్నావు. ఇప్పటికి మూడురాత్రిళ్ళనించి నిద్రలేక వెధవరైలు ప్రయాణాల్లో. కాస్త కునుకుపడుతోంది అనుకునేటప్పటికి నువ్వు. తలగడా పుచ్చుకు డాబామీదికి పొమ్మంటావా? నోరుమూసుక్కు పడుకుంటావా ..."

"మీరు నన్ను చూచేసరికల్లా కస్సు, బుస్సు మంటూనే ఉంటారు. నేనేంపాపం చేసానండి."

"నువ్వేం పాపం చేసావో నాకు తెలియదుకాని నాకు కోపం తెప్పించకు."

"కారణంలేనిదే, ఏతప్పుచెయ్యనిదే ఆడవాళ్ళపై అక్రమంగా కోపంతెచ్చుకోవటం మగవాళ్ళ సహజ లక్షణమా?"

"అబ్బ, ఒక్క క్షణం నిద్రపోదామని పక్కవేస్తే ఈ మూడురోజులనించి నిద్రలేని బడలిక తీరుతుందనుకున్నాను. నీకళ్ళు చల్లబడ్డాయా. ఇదుగో లేచికూర్చున్నా."

"మిమ్మల్ని నిద్రలేనప్పుడు లేపికూర్చోపెట్టి బాధిద్దామనికాదు. మానాన్న మిమ్మల్ని ఒక సైకిలు కొనుక్కోమని మూడువందల రూపాయలు మనియార్డరు పంపాడు. సంతోషవార్త. బాగుందా?"

"గొప్పపని చేసాడులే. వాచీ రెండువందలు ఎగగొట్టి సైకిలుకు మూడువందలు పంపితే నిన్ను పంపిస్తానని ఆ ముండాకొడుకు ఆశ. ఈపట్టు వాచీకి ఇంకో రెండువందలు బిల్లుచేసి నాల్గువందలు పంపితేనేగాని ఉత్తరం ముక్కకేనా ఆశ వదులుకోవల్సిందేనని చెప్పు. ఆ మూడువందలుఎవ్వి ఇల్లాపారెయ్యి."

"ఇస్తే నాకేం చేయించుకొస్తారేమిటి?"

"నెక్లెస్ పట్టుకొస్తా."

"అయితే ఇవిగో మూడువందలు."

"అయితే నేవచ్చేప్పుడు కొనుక్కొచ్చిన కొత్తసూటుకేసులో అట్టపెట్లో నెక్లెసు తెచ్చుకో."

"నిజంగా తెచ్చారాండీ. నాకేనా?"

"నీకు కాదు. అది ఎవరికో యింకోరికి. తెల్లారేదాకా అది పెట్టుకుంటే తెల్లారాక యింకోటి తెస్తా."

"ఎవరికోసమో తెచ్చిన నెక్లెసు నాకెందుకు. ఛీ! ఏపాడుముండకోసం తెచ్చారో. అది ఆ పెట్లోంచి తీసిపారెయ్యండి."

"నువ్వే ఆ పాడుముండవి. నీకోసమే అది."

"నాకోసమే అయితే అన్ని అబద్ధాలెందుకండి?"

"ఆ నెక్లెసు పెట్టుకుని శుభ్రంగా నిద్రపో. ఏం బాగుందా.

నువ్వు పెట్టుకుంటే బాగుగానే ఉంటుందికదూ. ఇంక నిద్రపో."

"నన్ను పడుకో పడుకో అని అల్లా పదేపదే చెప్తారేమిటండి. నాకు నిద్రవచ్చేదాకా ఈ నెక్లెసు మెళ్ళో పెట్టుకుంటే ఎంత అందంగా ఉంటుందో పెద్ద అద్దంలో చూస్తూ నుంచుంటా."

"పోనీ ఆ పెద్ద అద్దం దగ్గిరకిపోయి అల్లాగే నిలబడిచూడు."

"నన్ను ఏదో విధంగా అవతలిక్కి తోలేసి నిద్రపోదామని. ఏమండీ, మీకు యిందాకా నామీద అంతకోపం వచ్చిందికదా, మీకు సమస్త సేవలు చేస్తున్నా. మీకు యిక్కడకాలు అక్కడ పెట్టకుండా అన్నీ అందించి కాళ్ళుపిసుకుతూ ఎన్నెన్నో చేస్తున్నా. యిన్ని సేవలు ఎందుకు చేస్తున్నానండి?"

"చంచల హృదయుడు అస్థిర చిత్తుడయిన మగవానిని తనవైపు లాక్కుని ఎల్లప్పుడు అతనిదృష్టి మరొకదెసకు పోకుండా ఉంటానిక్కి."

"ఏమండీ ... స్త్రీ ఒక బానిసా లేక యంత్రమా లేక వ్యక్తిత్వంలేని మట్టిబొమ్మా మీదృష్టిలో? స్థిరమయిన అనురాగాన్ని కలగచేసుకోటానక్కంటూ మేము యిన్ని సేవలు మగాళ్ళకు చేయవల్సివస్తే మగవాళ్ళు మాఅనురాగాన్ని చూరగొంటానిక్కి మాబట్టలు, జాకెట్లు, బాడీలు ఉతుకుతున్నారా?"

"లేదు."

"లేనిదానిక్కి మేమెందుకు మీకు అనురాగంపేరిట సేవలు చెయ్యాలి. యిల్లా ఎంతకాలంచెయ్యాలి?"

"ఎంతకాలమేనా చెయ్యాలి."

"అబ్బా, అల్లాకాదు. చెప్పండీ."

"అయితేవిను. ఆడవాళ్ళలో కట్టుబాటువచ్చి వ్యభిచారిణులసంఖ్య శూన్యమయి, అందరూ పతివ్రతలయిననాడు ఎవరిమొగుళ్ళు వాళ్ళకి చచ్చినట్టు లొంగుతారు. ఇక ఎక్కడిక్కీ ఎగేసుక్కీ పోవటానిక్కి సావకాశం ఉండదు. అట్లాజరగటం అనేదేఉంటే ప్రపంచంలో ధర్మం నాల్గుపాదాలా నడుస్తుంది. పరస్త్రీ అంటే మర్యాద, గౌరవం ప్రజలలోకల్గి అత్యాచారాలిక్కీ, దుర్మార్గాలిక్కీ తావుఉండదు. దీనినే రాముడు ఆచరించిన ఏకపత్నీవ్రతం అనికూడా అనవచ్చు. ఇకపోతే సుఖరోగుల మరణసంఖ్య క్రమక్రమంగా క్షీణించి అంటురోగాలు అంతర్ధానమవుతాయి. ప్రతీచోటా దేశంలో శాంతి భద్రతలు ఏర్పడి రాజ్యంలో అరాచకాలుపోయి సుభిక్షంగా ఉంటుంది. మనువర్తిదావాలు అసలే మటుమాయమయి కోర్టుకురాబడి తగ్గినప్పటికీ, ప్రభుత్వం ఈ ద్రవ్యాన్ని మరోవిధంగాకూడ తీసుక్కుంటుంది. అంచేత యీకట్టుబాటు ఆడవాళ్ళలోకల్గాలి."

"ఏమండీ, ఈ కట్టుబాటు మగవాళ్ళలోనే కలిగి వారే వ్యభిచారిణుల యిళ్ళకు పోకుండాఉంటే. ఏం. ఆడవాళ్ళే కట్టుకట్టాలా?"

"అవును. రేపు మీనారీస్థానీపార్టీ అధికారంలోకివచ్చాక మగవారంతా వంటలుచేస్తారు. పిల్లకాయల్ని ఆడిస్తారు. ఒక్కపిల్లల్ని కనటంతప్ప మిగతాయావత్తు ఆడవాళ్ళు యిప్పుడుచేసేపనులు అన్నీ కూడా అప్పుడు మేంచెయ్యవల్సి వస్తుంది. దేశంలో నాయకులు అంతా ఆలోచించి నెమ్మదిగా మిమ్మల్ని ఉద్ధరించటానిక్కి ప్రయత్నిస్తున్నారు. అప్పుడు మగవాళ్ళను కట్టుకడతాము. యిప్పుడు మీరే కట్టుకట్టాలి."

"ఏమండీ మీరు చెప్పిందంతా యదార్థంకింద కనిపిస్తుందేమో."

"అయితే కావచ్చును."

"మరి స్త్రీ యంత్రం అనేమాటకి మీ సంజాయిషీ ఏమిటండోయి మాష్టరుగారూ."

స్త్రీ ఎప్పుడూ యంత్రమే. సృష్టి అంతా స్త్రీలోనే వుంది. సృష్టి ఉత్పన్నానికి కారకురాలు. పాట్లుపడి, మోసి పెంచి పెద్దవాళ్ళనిచేస్తూ యీపని అంతా యంత్రంలా చేస్తుంది. యీ యంత్రం భగవంతుడు చేసిపెట్టిందే. ఇది ప్రకృతి సిద్ధమయిన యంత్రం.

"స్త్రీ యంత్రం కాకపోతే మరి బానిస అంటారా. ఏమిటోనండి ... ఈ మధ్య యిల్లాండ్ర చాలామంది మేము బానిసలమని, యంత్రాలమని తెగరాసిపారేస్తూంటే మాకు "ఇదేమిట్రా మన నిజస్థితి యిల్లాగుందా" అని గుండెలు బెంగపెట్టుకున్నాయి. నెమ్మదిమీద ఆలోచిస్తే మీరు చెప్పినదాన్నిబట్టి అంతా యదార్థం అని తోస్తోంది. అయితే స్త్రీని గురించి మీ పరిపూర్ణ అభిప్రాయం ఏమిటో చెప్పండి"

"సుఖమయమయిన సంసార సాగరాన్ని ఈదేందుకు, మగనితోకూడా కష్టసుఖాల్ని భరించి తాళుకోగలనని పూచీపడ్డ ఒక వాటాదారు. చంచలచిత్తుడయిన భర్త మనస్సును క్రీగంటి చూపుతో కట్టివేయగలిగిన ఒక మహామేధావి. కాని నిర్మలమయిన మనస్సు కానందున అనుమానమనే పెనుగాలికి ఊగుతూ తన జీవితరంగంలో ఎప్పుడూ ఏదో తుఫాను చెలరేగిస్తుంటుంది. ఎక్కడేను ఒకకలత పుట్టింది అంటే అది ఆడదానివల్లే పుడ్తుంది. చాలావరకు స్త్రీని నీచంగా పరిగణించే మగవారు రానురాను తగ్గిపోతున్నారు. కులటలను ఎప్పుడూ నిందిస్తారు. పతివ్రతలకు ఎప్పుడూ ఉంది మంచిమాట."

# రచనానైపుణి

శ్రీమతి సూర్యదేవర సులోచనాదేవి

చదవటం వేరు, వ్రాయటంవేరు. వ్రాయగలిగే వారంతా చదవగలరు, కాని చదవగలిగే వారంతా వ్రాయలేరు. రచనానైపుణ్యం సాధన మూలంగా అలవడే ఒక ఉత్తమశిల్పం. చాలామంది సోదరీమణులు రోజంతా చదవగలరు, కాని ఒక్క పదిహేను నిమిషాలు కూర్చొని వ్రాయలేరు. ఇందుకు కారణం వారిలో కల్పన లేక కాదు, కల్పనకు తగిన పదాలు దొరకకాకాదు, కేవలం తాము వ్రాయగలం అనే ఆత్మవిశ్వాసమూ, ఆలోచనలకు ఒక సక్రమ రూపం ఇచ్చే అభ్యాసమూ లేక మాత్రమే.

"గృహలక్ష్మి" వచ్చి మన ఆంధ్రసోదరీమణుల్లో చాలామందిలో ఇదివరకు ఇమిడి వున్న యీ వ్రాయలేని తనాన్ని చాలవరకు నశింపు చేసింది; ఇప్పుడు చేస్తూవుంది; ఇక ముందు చేస్తుంది కూడాను. తోటి తెలుగు సోదరీమణుల రచనలను చూచి, ప్రోత్సాహితలై, అనేకమంది వనితలు సుందరమైన రచనలు వ్రాయటం ప్రారంభించారు. బాగా చదవకలిగిన వారంతా బాగా వ్రాయగలవారుగా మారాలనే మనందరి అభిలాష.

రచనా పటిమకు ప్రధానం విషయజ్ఞానం. ఒక విషయాన్ని గురించి బాగా తెలియందే ఆ విషయాన్ని గురించి వ్రాయటం అసంభవం. విషయజ్ఞానం సంపాదించాలంటే అనేక విషయాలను గురించివున్న పుస్తకాలనూ, పత్రికలనూ చదవటం అవసరం. చదవటమంటే నవలను చదివినట్లు పుటలు వడివడిగా త్రిప్పి వేయటంకాదు. నిదానంగా, కంటితోకాక, మనసుతో చదువుతూ విశేషాలను పుస్తకంలో నోటు చేసుకోవాలి.

విషయజ్ఞానం ఎప్పుడైతే ఏర్పడుతుందో, ఆవిషయానికి తగిన పదాలు వాటంతటవే దొర్లుతవి అభ్యాసంవల్ల. తమ రచనలు పెద్దవిగా నుండాలని అభిలాషపడి చాలామంది సోదరీమణులు రచనలోని గాంభీర్యాన్నీ లాలిత్యాన్నీ, పోగొట్టుకుని మొదలిడతారు. కావలసింది సారంకాని సంఖ్యకాదు. ఎక్కువ విషయాన్ని కొద్దిమాటలద్వారా వ్యక్తపరిచే మార్గాన్ని అలవరచుకోవాలి. రచనలు చిన్నవిగానూ, గాంభీర్యంగానూ, సుందరంగానూవుంటే, వ్రాసేవారికి శ్రమగానూ వుండదు, పత్రికలవారికి కాగితం ఖర్చూ ఎక్కువ వుండదు, అటు చదివే వారికికూడ అధిక ప్రయాస వుండదు.

ప్రతి రచయిత్రీ తాను వ్రాయబోయే విషయాన్ని ముందుగా మనసులోనే బాహ్యరేఖల్లో దిద్ది తీర్చి వుంచుకుంటే, కాగితమూ కలమూ తీసుకొని ఆలోచిస్తూ వృథాగా కాలవ్యాపన చేయాలసిన అవసరం వుండదు. వ్రాయబోయే ప్రతిరచననూ

స్థూలంగా మూడు భాగాలుగా విభజించుకోవాలి: ఆది, మధ్య, అంతం. ఎప్పుడూకూడా ఆది, అంతం యీ రెండూ చాలా ఆకర్షణీయంగా వుండేలాగా ప్రయత్నించాలి. ఏలంటె, రచన ఆదిలో బాగుండకపోతే, చదివేవారు ఇక లోపలకు చదవకుండా దాన్ని అంతటితో మూసేస్తారు. ఇక రచన అంతంలో కనుక మనోహరంగా లేనిచో, చదివి ముగించిన వారిమనస్సు పై విశేష ప్రభావం ఏమీ పడదు. ముగింపులో చదివిన ఆఖరు వాక్యాలే పాఠకుల హృదయాల్లో నిలచిపోయేవి. కనుక రచనలోని ముగింపు చాలమనోహరంగా వుండాలి.

రచనలో ఒక విషయాన్ని గురించి చెప్పేటప్పుడు అతిగా వర్ణించటం బాగుండదు; అదే విధంగా అసలు వర్ణించక పోవటంకూడా బాగుండదు. వర్ణన తగుమాత్రంగా మాత్రమే వుంటే బాగుంటుంది. రచన సాగించే ప్రాథమికులు ప్రధానంగా గుర్తించుకో వలసిన విషయమేమంటే పెద్ద పెద్ద వాక్యాలకొరకూ, గొప్ప గొప్ప పదాలకొరకూ వెదకరాదనేది. తాను వ్యక్తపరచ దలచిందేమిటో, దాన్ని చిన్న వాక్యాల్లోనూ, మామూలు పదాల్లోనూ చెప్పివేయటం అలవరచుకోవాలి. అంటే పెద్దవాక్యాలూ, గొప్పపదాలూ వాడకూడదని తాత్పర్యంకాదు. రచయిత్రి క్రమేణ తన రచనా శిల్పంలో ఉన్నతి పొందిన కొలదీ తన శైలిని ఉచ్చస్థాయికి తెచ్చుకోవచ్చు. కాని, ప్రథమంలోనే పెద్ద పెద్ద వాక్యాలకొరకూ, గొప్ప గొప్ప పదాలకొరకూ చూస్తే, అలాంటి ప్రయత్నంలో రచయిత్రియొక్క కలంలోని సిరా ఎండిపోవటం మాత్రమేకాక మనసులోని కల్పనాధారకూడా ఎండిపోతుంది.

రచయిత్రి ప్రతివిషయంపైనా తన కలాన్ని నడపాలని ప్రయత్నిస్తే, దాని ఫలితాలు సఫలంగా వుండవు. తనకు చొరవ అభిమానం వున్న విషయాలను గురించి బాగా పరిజ్ఞానం సంపాదించి ఆవిషయాలను గురించి ఆహ్లాదకరంగా వుండే రచనలను సాగిస్తే రక్తికడుతుంది. అంతేగాని, తనకు పరిచయంలేని విషయాలనుకూడా తెలిసినట్లునటిస్తూ వ్రాస్తే, ఆరచనలు చదివేవారికర్థం కాకపోగా, ఆవ్రాసిన రచయిత్రులకు అంతకంటె అర్థంకాకుండా పోతుంది. నేటి తెలుగు సోదరీమణుల రచనలు చాలా మనోహరంగా వుంటున్నవి. ఇంకాముందు ఇంతకంటె మనోహరంగా వుండగలవని ఆశ.

# వజ్రాలహారము

విమల సామాన్య కుటుంబములో పుట్టిన బిడ్డ, మంచి రూపవతి. ఆమెతండ్రి యామెను కొద్దిగా భూస్థితియు, గుమాస్తా యుద్యోగము చేయుచున్న మోహనరావునకిచ్చి వివాహము జేసెను. విమలకు నగలు ధరించుటలో మిక్కుటమగు యాశ యుండెడిది. కాని స్వల్పస్థితిపరుడగు మోహనరావామెకు విలువ గల నగలుచేయించి యామె యభీష్టము నెరవేర్చలేకుండెను. విమలకు మనస్సున నెన్నియో కోరికలు మొలకలెత్తుచుండెడివి గాని యవి తమంతట తామే యణగి పోవుచుండెడివి. భర్తతెచ్చు సంపాదన తిండికి, గుడ్డలకు సరిపోవుచుండెడిది. కాని విమలమాత్ర మెప్పుడును విచారముతోనే యుండెడిది.

ఇట్లు సంసారయాత్ర గడచిపోవుచుండగా నొకనాడు మోహనరావు ఆఫీసునుండి వచ్చునపుడొక శుభలేఖ బట్టుకొని వచ్చి విమలముందు పడవేసెను. ఆమె దానిని పరిశీలించిచూచి యొక వేడి నిట్టూర్పు విడిచెను. అందులకు మోహనరావు "విమలా నీవు సంతోషించుటకు మారు విచార పడెదవేల, మా ఆఫీసరు గారింటిలో వివాహము జరుగబోవుచున్నది. మనలనుగూడ రమ్మని యాహ్వానము వచ్చినది. ఇందులో విచారించుట కేమున్నద"నెను."

విమల:-"సంతోషించుట కేమియున్నది. ఆఫీసరు గారియింటి వివాహమునకు పోవలయునన్న నందులకు తగిన నగలుండవలయును, గుడ్డలుండవలయును. అవన్నియు లేని మనము వివాహమునకు పోవుట గౌరవహీనము."

మో:-"విమలా నేను సైకిలు కొరకు నూరు రూపాయలు నిలువచేసి యుంచినాను. దానికి తగుమైన చీర తీసుకొనుము. నీవు సహజముగా సౌందర్యవతివి, కాబట్టి నీకు నగలులేకున్నను కష్టములేదు."

విమల:-"సరేలెండి, చీరకొన్న తర్వాత దానికితగ్గ నగ యొక్కటియైనా లేకున్న బాగుండదు. నాస్నేహితురాలైన సరోజిని నడిగి యొక్క నగయైనా తెచ్చుకొందున"నెను.

మో:-ఒకరి వస్తువులు యెరువు తెచ్చుకొనుట, అందులో నగలు నాకేమియు యిష్టములేదు. ఒకవేళ యెచ్చటనైనా గ్రహచారముతప్పి పడిపోయినచో మనమిచ్చుకొనుటకు శక్తిగలవారమా?

విమల:-చాలులెండి! ముందుగనే ఆమాట అంటారేమిటి నేనుమాత్ర మొకరి వస్తువులు తెచ్చినప్పుడు తగిన జాగ్రత్తతో మెలంగెదను. చీరయు, తగిన నగయు తెచ్చుకొందును. మోహనరావు తాను దాచియుంచిన నూరు రూపాయలు తెచ్చి విమలకిచ్చి తానాఫీసుకు వెళ్లిపోయెను.

విమలయు తన పనులన్నియు త్వరితముగా ముగించుకొని సరోజినింటికి వెళ్ళి "సరోజా నేను వివాహమునకు పోవలయును. నీవు మొన్న క్రొత్తగా చేయించుకొన్న వజ్రాలహార మిచ్చెదవా! పెండ్లయిన మరుసటిరోజే భద్రముగా తెచ్చియిచ్చెదను." అని అడిగింది. సరోజినియు సరేనని వెల్వెట్టు పెట్టెలో భద్రపరుపబడియుండిన వజ్రాలహారమును తెచ్చియిచ్చినది. తర్వాత విమలయు, సరోజినియు చీరలంగడికి వెళ్ళి మంచి కెంపుకలరు చీరయు, దానికితగ్గ రవికెయు తీసుకొని వచ్చిరి. సాయంకాలము మోహనరావు వచ్చినతోడనే విమల తాను తెచ్చిన వన్నియు చూపించినది. అతడును హారమును మాత్రము తగిన జాగ్రత్తతో గమనించుకొనుమని చెప్పెను.

పెండ్లికి పోవలసిన రోజుదయముననే విమల మేల్కొని స్నానపానములు ముగించుకొని తల దువ్వి పువ్వులతో చక్కగా నలంకరించుకొని పట్టుచీర కట్టుకొని వజ్రాలహారము ధరించి అద్దములో తన ప్రతిబింబమును చూచుకొని చాల యానందించినది. తరువాత భర్తతో గూడ పెండ్లింటికి బయలుదేరినది.

పెండ్లింటిలో అందరును విమలను పరామర్శించువారే, ఆఫీసరు గారి భార్య కనకమ్మ "విమలా వజ్రాల హారము క్రొత్తగా చేయించుకొంటివా? నీకది చాలా బాగున్నదిసుమా!" యనినది. పెండ్లిసందడంతయు ముగిసిన పిదప సాయంకాలము విమలా మోహనరావు లింటికి యానందముతో వచ్చిరి. ఆమాట యీమాట మాట్లాడు కొనుచుండిరి. మోహనరావు "విమలా నీవు వజ్రాల హారము పెండ్లింటిలో చక్కని మర్యాద యిచ్చినదని" చెప్పుటయే తడవుగ విమల కంఠమున చెయ్యివేసి చూచుకొనగా హార మగుపించలేదు. "అయ్యో! హారమెచ్చటనో పోయినదే" యని యిల్లంతయు వెతకిరి అగపడలేదు. మోహనరావు తొందరగా తామువచ్చిన త్రోవనే వెతకుచు పోయెను గాని యెచ్చటను నగుపడలేదు. ఆఫీసరుగారి యింటికి పోయి వెతకుటకు మనస్కరించలేదు. ఇంటికి విచారముతో తిరిగి వచ్చెను. దంపతుల విచారమునకు మేరయే లేదు.

మరునటిరోజు దంపతులిరువురు నగలషాపుకు వెళ్ళి సరోజిని వజ్రాలహారము మాదిరిది వెల యడుగగా నలభై వేలకు తక్కువ రాదనిరి. బేరమాడి తుదకు ముప్పయి వేలకు కుదుర్చుకొని నాలుగైదురోజులలో తెచ్చియిచ్చి హారము తీసుకొని వెళ్ళెదమని చెప్పిపోయిరి. మోహనరావు తండ్రి సంపాదించిన భూమి నంతయు నమ్మగా యిరువదియైదు వేలు వచ్చినది. తెలిసినవారిదగ్గర అప్పులుతీసి హారమునకు చెల్లించి తీసుకునివచ్చిరి. విమలయు భద్రముగా దానిని తీసికొనివెళ్ళి సరోజిని కందజేసినది.

మరునాటి నుండియు దంపతులు వేరేయిల్లుమార్చుకొనిరి, దినమున కొకపర్యాయము భుజించుచు తమకగు వ్యయములన్నియు తగ్గించుకొని యెన్నెన్నో కష్టములుపడి పది సం॥ రములలో అప్పులవారి కందరికిని మొత్తమును యిచ్చివేసిరి. ఇందులకు గాను పడినశ్రమవల్ల వారి రూపములే మారిపోయినవి, వారిని పది సం॥ రముల క్రిందట చూచినవారు యిప్పుడు వారిని చూచిన గుర్తుపట్టుటకే శక్యము కానంతటి హీన స్థితికి వచ్చిరి. ఒకరోజున విమల సామానులు కొనుట కంగడి దగ్గరకు వెళ్ళియుండగా తన స్నేహితురాలగు సరోజిని యగుపడినది. సరోజిని విమలను గుర్తుపట్టలేదు. విమలయే ధైర్యంచేసి సరోజినియని పలుకరించినది. కష్టముమీద సరోజిని గుర్తుపట్టి "యేమి విమలా చాలా మారిపోయినావే" యనినది. విమలయు మారిపోవుటకు కారణము తన స్నేహితురాలే యని చెప్పినది. తాను సరోజిని వజ్రాలహారమును పోగొట్టిన విధమును, దానికిబదులు వేరొకటి కొనియిచ్చుటయు, అప్పులను తీర్చుటకు పడినకష్టములవల్ల మనిషి గుర్తుపట్టుటకు వీలులేనంత మార్పును గలుగ జేసినదని చెప్పినది. అందులకు సరోజిని చాలా విచారపడి "అయ్యో! ముందే నాకీసంగతి యెందులకు జెప్పగూడదు. నావజ్రాల హారమునందు గూర్పబడినవి నిజమైన వజ్రములు గావు. అవి రంగూను వజ్రములు. యిప్పుడైనా మునిగిపోయింది ఏమియు లేదు. మన యింటికివచ్చిన వజ్రాల హారమిచ్చెదను. దానిని తీసుకొని వెళ్ళి యెవ్వరిదగ్గర తెచ్చినారో వారికిచ్చివేసి పైకం తీసుకొని రండు. తరువాత మనమిరువరము పోయి నాహారము రంగూను వజ్రములతో చేయబడినది కొనెదను మిగతాడబ్బు మీరుతీసికొని సుఖముగా నుందురుగాని" అని తన యింటికి తీసుకొనివెళ్ళి హారము విమలకిచ్చివేసినది. మోహనరావానందముతో హారమును అంగడివానికి యిచ్చివేసి సొమ్మునుతెచ్చి యిచ్చి వేసెను. సరోజినియు తన రంగూను వజ్రముల హారమునుగొని మిగత ద్రవ్యమును విమలకిచ్చివేసినది. విమల మోహనరావు లానందముతో సుఖముగా జీవనము చేయుచుండిరి.

ఇప్పటికిని స్త్రీలలో కొంతమందికి యేచిన్న శుభకార్యమునకు పోవలసియుండినను తమ స్నేహితురాండ్ర దగ్గరనో బంధువుల దగ్గరనో నగలెరువు దెచ్చుకొని యలంకరించుకొని పోవుచున్నారు. ఇది యెప్పటికిని కష్టములకు కారణమని పైకథ యుదాహరణ మిచ్చుచున్నది.

బి. గౌరీదేవి.

—(o)—



త న్మ య త



# మామిడి



## మామిడికాయ మురబ్బా

చిలకముక్కు మామిడికాయ 1 (కోలుమామిడి) అంటే దోరపండుగానుండవచ్చును. సన్నగా ముక్కలుచేసి యుంచవలెను. ¼ వీశ పంచదార, ¼ అళాకు నీరుపోసి బాగా మరగిన తర్వాత తరిగివుంచిన మామిడిముక్కలువేసి గరిటతో కలియబెట్టుచుండవలెను. ½ గంట బాగా వుడికిన తర్వాత తీసి గాజుపాత్రలో వేసి యుంచవలెను. దీనిని గోధుమరొట్టెలు, పూరీలు మొదలగు వానికి నంజుడుగా నుపయోగించవచ్చును. జీరాలో ½ చంచా ఏలకపొడి, చిటికెడు కుంకుమపువ్వువేసి కలుపవలెను. ఇది చాలా బాగుండును,

## మామిడి పిందెల వగరు పచ్చడి

మామిడి పిందెలు పట్టెడు, మామిడిపూలు కొంత, మామిడి చిగురులు కొన్ని పోసలు, అల్లంముక్క 1 టి. ఇవన్నీ శుభ్రపరచి యుంచుకొనవలయును. ఆ వెనక తగినంతవుప్పు, కాస్త చింతపండు, కాస్త బెల్లం పైన చెప్పినవన్నీ రోటవేసి కలయదంచుకొని, చిటికెడు జీలకఱ్ఱ, చిటికెడు పసుపుపొడి, ఒక నిమ్మ పండు రసము తీసి వేసి కలయబెట్టి తీసి యుపయోగింపవలెను. ఇది పిత్తమునకు చాలా మంచిది.

## మామిడికాయ మెంతికాయ వూరగాయ

పుల్లటి మామిడికాయలు 25 సన్నముక్కలుగాతరిగి, తగినంత గాజుపాత్రలో లేక పింగాణి జాడి యందువేసి, ¼ పడి మెత్తని వుప్పువేసి కదలించి మూసి యుంచవలెను. కొన్ని గంటలు అయిన తర్వాత ¼ వీశ ఎండుమిరపపొడి, 1 చంచ పసుపుపొడి వేసి కలియబెట్టి మూసి యుంచవలెను. రెండవరోజు వుదయం 1 పలం మెంతులు ఎఱ్ఱగా వేయించి తీసి యుంచవలెను. ¼ పలం ఇంగువ వేయించి పొడిచేసి, వేయించి వుంచిన మెంతులుకూడా పొడిచేసి మామిడి ముక్కలలో వేయవలెను. ఆ తర్వాత ¼ వీశ మంచినూనె అంటే నువ్వులనూనె బాణలిలోపోసి బాగా కాగనిచ్చి పిడికెడు ఆవాలువేసి చిటపట అనగానే తీసి యుంచవలెను. బాగా చల్లబడిన తర్వాత వూరగాయలో పోయవలెను. తర్వాత బాగుగా కలియబెట్టి యుపయోగించవలెను. ఇది చాల రోజులవరకు చెడక నిల్వవుండును. దీనిలో కావలసినవారు తెల్లపాయలు (వుల్లిపాయలు) చెట్టు సెనగలు కొంత వేసుకొనవచ్చును. వూరుగాయలో నానిన తర్వాత ఇవి చాల రుచికరముగా నుండును.

## మామిడిపండు పాయసం

మెత్తగా మాగివుండే మామిడిపండ్లు అంటే రసపూరి, బాదామి ఇలాంటివి మెత్తగా చాలా బాగుండును. మంచి మామిడిపండ్లు 2 కొని తెచ్చి తోలు విడిపించి గుజ్జుచేయవలెను. ఆ వెనక ఏలకపొడి 1 చంచా. కుంకుమపువ్వు చిటికెడు, పంచదార 5 పలములు, మంచిపాలు 1 అళాకు, పచ్చి కొబ్బరి కోరు పిడికెడు అన్నీవేసి పొయ్యిమీద పెట్టి గరిటతో కలియపెట్టుచుండవలెను. 2 నిమిషములు వుడికిన తర్వాత జీడిపప్పు 3 తులములు నేతిలో వేయించి తీసి పాయసంలో వేసి వుపయోగించవలెను.

## మామిడిపండు రసాయనం

చక్కని మామిడి పండ్లను 2 తెచ్చి సన్న ముక్కలుగాకోసి తగినంత పాత్రలో నుంచవలెను. ఆ వెనక పచ్చికొబ్బరి ముక్కలు కొంత, ఏలకపొడి ½ చంచ; ¼ వీశ తేనెపోసి వుపయోగించవచ్చును. వలయువారు బెల్లం, లేక పంచదారవేసి కలిపి వుపయోగించవచ్చును.

## మామిడికాయ షరబత్తు

దోరమామిడికాయనుతెచ్చి కోరి రసము తీయవలెను. ఆ వెనక తెల్లని వస్త్రమునందు శోధించి పులుపు తగ్గునంత నీరుపోసి తగిన పంచదార, ఏలకపొడివేసి కలిపి వుపయోగించవలెను. ఎండ పొద్దులో త్రాగుటకు ఎంతయో మనోహరముగ నుండును.

ఎమ్. ఆర్. సీతమ్మ

—o—

# సంపూర్ణ జీవనానికి సాధనములు

## కర్మాచరణ - సేవ

-❀❀❀❀❀-

భగవద్గీతలో చెప్పబడిన కర్మయోగమంతా, కర్మ చేయవలసినదనే చెప్పుచున్నది. అది ఎటువంటి కర్మ? నిష్కామ కర్మట. అంటే? ఈపనిచేసిన ఈ ఫలంవస్తుంది. ఆపనిచేసిన మనకావిధంగా ఫలిస్తుందని, అనుకోకచేయడం ఆధర్మం చేస్తే. మనకు పుణ్యం వస్తుందని చేసినా, అది ఒకఫలం కోరి చేయడమే. కర్మయోగంలో సారమంతా, ఫలాపేక్షలేని కర్మచేయుటయే, చేయవలసింది మాత్రమే నీవిధి, దాని ఫలాఫలములను నాకు వది లెయ్యి మంటాడు శ్రీకృష్ణుడు.

మన బిడ్డలకు సేవచేయుటలో మనం ఫలం నిరీక్షిస్తామా, వారు పెద్దయిపెరిగి, సంపాదించి, మనకుచేస్తారన్న భావం అప్పుడు మనకు తోచదు. అనుకోము, అట్లే ఏసేవగాని, ఎవరిసేవగాని, ఫలం నిరీక్షించక చేయవలసినదే మన బాధ్యత. ఒకడు అతిచలి దేశములో మార్గములో నడచిపోతూ. చలిబాధకు తట్టుకోలేక, వడవడ వణికిపోతూ వుంటాడు. ఇంకొకడు కరడుగట్టి ఆమంచులో, మార్గమధ్యలో పడి వుంటాడు, మొదటివాడు ఆపడిపోయిన రెండవ మనిషినిచూచి, జాలిపడి, ఎత్తుకొని తన భుజంమీద వేసుకొని, నడచిపోతుంటాడు. ఆ ఇద్దరి శరీరముల రాపిడివల్ల ఇద్దరికి కొంచెం వుష్ణంకలిగి ఇద్దరు వారి వారి గమ్యస్థానం చేరుకోగలుగుతారు. తనకు మేలుకలుగు తుందని తెలీకుండానే అతడు ఇంకొకనికి సహాయము చేసెను. ఆసేవ తనకే సహాయ కారి అయినది. చూచారా! తాను, తనువేఱు అన్న భిన్నత్వం మర్చిపొమ్మన్నారు. తన వ్యక్తిత్వం ఆసేవలోనే, నిబిడీకృతమయి వుంటుంది.

సూర్యుడు ఏకోరికతో ప్రకాశిస్తున్నాడు? గాలి ఏకాంక్షతో వీస్తున్నది? సముద్రం ఏకాంక్షతో అలలతో సదా ఘోషిస్తున్నది? సదా సర్వకాలము, సర్వేశ్వరుడు, తమకు విధించిన కర్మను ఆచరిస్తున్నవి. ఆబ్రహ్మాండనాయకుడే, తన కర్మవశమున, తాను పుట్టుచు, గిట్టుచు తన కర్మ చేయుచున్నప్పుడు, మనము చేయమనుటకు, మన మెవరము?

మనుష్యుడు దేవుడిచ్చిన శక్తి సామర్థ్యములను దేవునికొఱకును, తోటిమానవుల కొఱకును, వుపయోగించినగాని, దేవుడు వానికి సహాయం చేయడు. మనుష్యుడు తన యొక్క భాగమును చేసిన, దేవుడు తన భాగమును చేయును.

పాపమను సముద్రాఘాతములోపడి, కొట్టుకొనుచున్న, మునిగి పోవుచున్న, ఆత్మలను రక్షించు విధం నేర్చుకొను, నిజమైన వేదశాస్త్ర పాఠశాల భగవంతుని యందున్నది. అనేకులు తమ బలహీనతను గూర్చి, ఆలోచించుటచేత, సేవచేయలేక పోతున్నారు. వారు దైవశక్తి, వారిబలహీనతలో బలము నిచ్చునని ఎఱుగకున్నారు.

ప్రేమే సేవయొక్క యదార్థతను తెలిపెడి ఒరుపిడిరాయి. మనమూ ప్రేమలో నిలిచి యుండి, ఒకరి నొకరు సేవించుచు, వారి రక్షణకై, తమప్రాణములను కూడ నర్పించుటకు సంసిద్ధులై యుండవలెను.

మహాత్ములను జ్ఞానులను, జనులు దూషించి, హింసించి దోషారోపణ అను రాళ్లతో వారిని కొట్టినప్పుడు, వారు జనుల క్షేమము కొఱకై ప్రార్థించి, రాళ్లకు బదులు ప్రేమయను ఫలములను, వారికి రుచి చూచుట కిత్తురు.

చెడ్డపిల్లవాండ్లు, తీయని ఫలవృక్షముమీద రాళ్లను రువ్విన, ఆచెట్టు పణగకుండ ఫలములను పడవేయును, ఎందుచేత ? దానిదగ్గర వేరేరాళ్లులేవు. పగదీర్చడానికి, మారేమీ చెప్పలేక, తనకు దేవుడిచ్చిన దాని నది ఇచ్చుచున్నది. అట్లే మహాత్ములు తమలో పగ, అసూయ, క్రోధం మొదలగు చెడుగుణములేపి వారిదగ్గర లేకపోవుటచేత, ప్రేమనే దూషించినవారికి పంచియిచ్చెదరు.

మనకాలము వ్యర్థము చేయక, సర్వలోక ప్రభువైన ఆభగవంతుని సేవ చేయుచు, ఇతరులను, అక్రమమునుండి, మరణమునుండి, రక్షించుచుండిన పరమాత్ముడు మనకు దివ్యానందము బహుమతిగా నిచ్చును.

ఇట్లు మానవ జీవితము సంపూర్ణత చెందుటకు, కర్మాచరణ తోడ్పడుచున్నది.

నెమలి చంద్రమతిదేవి

---



---




## అమ్మమ్మా!!!

అమ్మమ్మా నేనొస్తే
నాకేమిపెడ్తావ్!
అమ్మమ్మా నీవస్తూ
నాకేమితెస్తావ్!
పప్పుబెల్లము
పట్టుక వస్తావా?
పాలుమీగడ
తీసుక వస్తావా?
పట్టుచీరలెన్నో
పట్నమునుంచి నీకు
పట్టుకవస్తాను
పకపక నవ్వే
పరుగులుపెట్టే
మంచిబొమ్మలెన్నో
పట్నములో నాకు
'పప్ప' కొన్నారు!

అమ్మమ్మా నేనొస్తే
అత్తను బెల్లిస్తా
మామను మురిపిస్తా
మరదలు పిల్లను
మంచిచేసుకుంటా
పట్నమునుంచి నే
పరుగు పరుగున
పట్టువి చీరలు
నీకోసం తెస్తున్నా
నమ్మమ్మా తెస్తున్నా!
పాలు మీగడ
పప్పు బెల్లము
పదిలంగా దాచి
పట్టుకునుండమ్మమ్మా
పట్నమునుంచి నే
నొస్తున్నానమ్మమ్మా!!!

అద్దేపల్లి సత్యేంద్రనాద్ దీక్షిత్





## మధుర పేణీలు

1 శేరు గోధుమ పిండిగాని, మైదాపిండిగాని, జల్లించి ఒక సోలెడుపాలు, చిటికెడు కొట్టిన వుప్పు, 8 తు. నెయ్యివేసి తగునీటితో గట్టిగా కలపవలెను. 4 గంటలు నాననిచ్చి, రోటిలోవేసి దంపి వుండలుగాచేసి, పీటమీద పూరీలవలె వత్తి ముక్కలుచేసి నేతిలో వేయించవలెను. 1 వీశ చక్కెరపాకం పట్టి వేయించిన ముక్కలు పాకంలో వేయవలెను.

## మజ్జిగ జంతికలు

1 తవ్వ బియ్యపుపిండి, అరసోలెడు గోధుమపిండి, తగువుప్పు, మజ్జిగవేసి గట్టిగకలిపి, నేతితోగాని, నూనెతోగాని జంతికలు వేయించవలెను.

## బంగాళాదుంప వడ

1 సోల శనగపప్పు, 1 సోల మినపప్పు, 1 సోల పెసరపప్పు, నీటిలో 4 గంటలు నానపెట్టవలెను. 1 తులం వుప్పు, తగు పచ్చిమిరపకాయలు, కొంచం అల్లం, 10 తు. నీరుల్లిపాయలు వేసి నానినపప్పులు మెత్తగా రుబ్బవలెను. 15 తు. బంగాళాదుంపలు సన్నగా తరిగి పిండిలోకలిపి నూనె కాగనిచ్చి, వడలుచేసి వేయించవలెను.

## కంది పొడుము

కందిపప్పు, శనగపప్పు, సమంగాకొల్చి, కమ్మగా వేయించవలెను. తరువాత గుండగా విసరవలెను. తగువుప్పు, మిరపకాయలు, ఇంగువ జీలకర్ర మెత్తగాకొట్టి, పొడుంతోకలిపి, అన్నంలో వేసుకొనవలెను.

చావలి అన్నపూర్ణా బాయి.

## బోండాసీర్

ఒకశేరు బియ్యపుపిండి (మెత్తనిది)ని శుభ్రముగాచేసి ఒకగిన్నెలో పోయవలెను. ఒక కొబ్బరికాయ కోరి ఒకఆకులో పోయవలెను, ఒక సోలెడు బెల్లపుపొడుము ఒక గిన్నెలో పోయవలెను. ఈ మూడు రుబ్బి ఒక గిన్నెలో ఉంచవలెను. ఒక బూర్లమూకుడులో నూనెపోసి పొయ్యిమీద పెట్టవలెను. అందు ఈ పిండిని రొట్టెరూపంగావేసి తినిన చాలరుచిగా నుండును. చెప్పనలవికాని రుచి.

చాగంటి అలివేలు మంగతాయారు.

## నాట్‌కూర్

నవనవలాడే చక్కని కొత్తిమిరి తీసుకొని శుభ్రముగా కడిగి ఒక ఆకులోపెట్టవలెను. దాని వేళ్ళను కత్తిరించవలెను. కొత్తిమిరికి తగినన్ని మిరపకాయలు. ఉప్పువేసి మెత్తగా రుబ్బవలెను. దీనిని ఒక జాడీలో ఉంచవలెను. పచ్చగామగ్గిన నిమ్మపళ్ళు పట్టుకొనివచ్చి తగిన గింజలులేని రసమును అందుపోయవలెను. ఆ పచ్చడి, రసముకలిపి తినిన చాలరుచిగానుండును. చాల ఆరోగ్యము.

దేశరాజు సీతాదేవి.

—(:o:)—

# ఆత్మవిమర్శ

శ్రీ జి. విజయరాఘవాచార్యులు, శ్రీమతి జి. భాగ్యలక్ష్మి

"అయ్యో! నావలె దీనికి ఆహార నిద్రాసుఖములు, బ్రతుకునందభిలాష యుండవా? నేనేజంతువునై యుండిన, నన్ను తినుటచే మీకండరములు వృద్ధిచెందును. తినుడు" అని యనెడివాడనా? యను నాత్మ విమర్శయున్నచో నెవ్వడును మాంసాహారి గాకుండు నేమో!

"నన్నే సర్వసమాజము వెలివేసిన, ఇంతటి యోరిమితో ఆవెలివేసిన సమాజము మేలునకే సర్వశక్తుల దారవోయుచుండెడి వాడనా?" యని యాత్మ పరీక్ష చేసికొనినచో అస్పృశ్యులను విభేదమే కల్పింప బడక పోయెడిదేమో!

ఆత్మవిమర్శ లేకపోవుట సర్వానర్థములకు సమస్త దుర్వ్యవహారములకు దారి తీయునని, ఆత్మవిమర్శ సమస్త సద్వ్యవహారములకు నిదానమని, దీనిచే మనము తలంప వచ్చును.

ఆత్మవిమర్శగల వ్యక్తి ఇతరుల కప్రియము, అహితము దలపెట్టక పోవుటయే గాక, ఇతరులకు కష్టము కలిగించు మాటలనైతము అనజాలడు. ఇట్టివాడు తానొక నికి కష్టము గలిగించవలసిన యవసరమున, "నాకే ఇట్టికష్టము గలుగుచో?" యని తర్కించును, తనచే ఇతరు డనుభవించగల కష్టమును అంతరనుభూతిచే తెలిసి బాధ నొందును. అందుచే అతడు సర్వజనప్రియమగు ప్రవృత్తి నలవరచుకొనును. ఆత్మ విమర్శతో గూడిన దృక్పథమే అతనికట్టి సత్ప్రవృత్తిని ప్రసాదించును. ఇట్టివారు గల సంస్థలు, ఇట్టివారు నిర్వహించు ప్రభుత్వములు, ఇట్టివారుగల కుటుంబములు చిరశాంతి మయములై యుండును.

సర్వధర్మములకు ప్రధానభూతమగు, నీమూలధర్మము శంకరుడు ప్రసాదించిన సర్వభూతాత్మ భావమునకు ప్రాథమికరూపమే; గృహశాంతిని, జీవనసుఖమును, సాధింప దలచిన ప్రతిదంపతుల కీధర్మము ముఖ్యానుసరణీయము.

నా భర్త నన్నాదరించుట లేదనియో, గృహ స్వాతంత్ర్యము వప్పజెప్పుట లేదనియో, డబ్బుపై పూర్ణాధికారము లేదనియో, గొణుగుట కొందరు కుటుంబినుల కలవాటు. కాని, తనయెడ భర్త కీచిన్నచూపు గలుగుటకు కారణము, తన ప్రవృత్తియే నేమోనని ఆమె వెనుదిరిగి చూడదు, ఆత్మవిమర్శకు దిగదు.

అట్లే నా భార్య పొదుపుజేయుట లేదనియో, నన్ను చులకనగా జూచుననియో, భర్తయు తలంచును. కాని వేయికన్నులతో తనలోపములను, భార్యయెడ తానవలంబించు చర్యలను తర్కించడు. తానే స్త్రీయైన యిట్టిదానికి తాను సమ్మతించువాడేమో యోచించడు.

నిజముగా యోచించిన ఆదాయమును మించినవ్యయము, దూబరతిండిగల ఇల్లాలికి గృహ స్వాతంత్ర్యమున కొరతగలిగి ఎంచిన తప్పేమి? కష్టసుఖముల భాగస్వామినియైన భార్యయెడ మక్కువలేక, తన సంతానమునకే ముప్పు తెచ్చిపెట్టగల చర్యలవలంబించు భర్త నుదాసీనముగా చూచిన దోషమేమి?

కావున, పైకొరతల నివారించుకొనుటకు, గృహచ్ఛిద్రముల రచ్చకీడ్చు చర్యలవలంభించుటకంటే, ఎవరంతటవారు ఆత్మపరిశోధన జేసికొనుటకు మంచి యుపాయము.

ఇట్టిస్వభావ మలవడిన, భార్యకు భర్తయు, భర్తకు భార్యయు, పూజనీయులై జీవయాత్ర గడపదగుదురని తోచును.

కుటుంబశాంతి నర్థించు ప్రతిపురుషుడు ప్రతిస్త్రీయు, ఎదుటివారి యనిష్ట ప్రవర్తనకు, తాను కారణమేమోనని యాత్మ విమర్శ ద్వారా ప్రశాంతముగ తర్కించుటనీతి.

—(:o:)—

# ఆదర్శ మిథునం

శ్రీ చీమలపాటి
సూర్యనారాయణ రావుగారు

(గత సంచిక తరువాయి)

"మనవాళ్లకిదో పాడు అలవాటు. పచ్చగా కనబడితే చూడలేదీ పాపిష్టి మానవ ప్రపంచం! ఏవో పాపలు శాస్త్రములలో వున్నాయని చెబుతూ, వాళ్లను కురూపులుగా జేసేవరకు నిద్రబోరు. యీ మగవారి స్వేచ్ఛాస్వైర విహారము లెంతవరకు సాగుతాయో? "

"అబల - సబల అయ్యేవరకు!"

"... అదీగాక మనమాపిల్లవయస్సులో వున్న యువతులకు తిరిగి వివాహాలు జరగటం జూస్తున్నాము; కానీ జుత్తులు తీయించటం చూడలేదు. పెళ్లిళ్లు చేయటానికిష్టం లేనివాళ్లు జుత్తులు తీయించటంలేదు!" అంది.

"పోనీ 30 సం॥ ల స్త్రీకి జుత్తుతీయించినా సబబుగా వుంటుంది!" అన్నాను.

"30 సం॥ ల స్త్రీకైనా జుత్తుతీయించాలని ఎక్కడ వ్రాసుందండి? భార్యపోయిన మగవెధవలు శాశ్వతంగా బుర్రలు గీయించుకుని యెందుకుండరు? వాళ్లకిలేని పట్టింపులు ఆడవాళ్లకెందుకుండాలి? అడిగే వెధవ లేకపోతేసరి! యింతకీ ప్రభుత్వం సరియైంది గాలేదు. ఉన్న-వాళ్ల యెదుట ధాటిగ నిలబడి వాదించి, యీ అనాచారాన్ని నిర్మూలించేందుకు గట్టి ప్రయత్నంజేసే రాజారాం మోహన్ రాయ్ వంటి మొగవాడు లేకపోయాడు."

"అసలు తండ్రికీపని సుతరాం యిష్టంలేదు; కాని నరు పినతల్లి ప్రోద్బలంవల్ల, ముఖ్యంగా ఆయింటిలోనున్న బోడిముండలునుంచి అతనీపనికి నరు వద్దని మొత్తుకుంటున్నను వినక పూనుకున్నాడు!"

"ఈ బోడిముండలునుంచి యెన్ని సంసారాలు మొదలంట కూలిపోతున్నాయో? చిన్నపిల్లకు జుత్తు తీయడమేమిటన్న పరిజ్ఞానం వారికెందుకు లేకపోయె? వీళ్ల యాచారాలు పరిదగ్ధం కాను ... చిన్నపిల్లను చేతులార చంపుతారుటండీ? "

"మరలాగే వుంది జూస్తూంటే!"

"వాళ్ల అన్నయ్యకీ విషయం తెలిసిందంటే యీ ఘనకార్యాన్ని తలపెట్టిన వాళ్లని, చేయమని ప్రోద్బల పరిచినవారిని అడ్డగా తెగవేస్తాడు. అంతపనీ జేస్తాడు గూడా. కానీ యిచ్చటి పరిస్థితులను అతనికి జెప్పేవారెవరు? "

"యీపిల్ల వుత్తరంద్వారా తెలుపుతే, వెంటనేవచ్చి, వీళ్ళని మీకిదేం బుద్ధని కేకలెయ్యడమో, తన్నడమో జేసి, యీకేశఖండన జరుగనీయక యాటంక పరచడమే గాకుండా, పైగా ఆమెను తిరిగి వివాహం జేస్తాడు గూడా!"

"నరు మాత్రం, కంఠంలో ప్రాణముండగా వాడికి తెలియ జెయ్యదు. మనమే వాడికిక్కడ పరిస్థితులను తెలియజేసి, రప్పించి, ఆమెకు కేశఖండన జరుగకుండా చేద్దాం!"

"నీయూహ సబబుగానుంది. అవును, నువ్వుచెప్పినట్లుగా చెయ్యటం మంచిది. ఆమె జీవితాన్ని నిలబెట్టిన వారమౌతాం; పుణ్యం పురుషార్థంగూడా లభిస్తుంది!" అన్నా.

"అయితే - యీ వ్యవహారం కాన్ఫిడెన్షియల్ గా జరగాలని నాయుద్దేశం, పైకి - పొక్కిపోయిందంటే, వాళ్లూ మనము పిలకా పిరికీలు పట్టుగోవల్సివస్తూంది!"

"అవునవును — ఐతే — యతని చిరునామా తెలియడెట్లా? —"

"నామదెల్సు! రేపుదయమే ఓ వుత్తరం బొబ్బిలినుండి సరు వ్రాసినట్లు వ్రాసి, పడేయండి!" అంది

"అలాగే —" అన్నాను.

"దీనితో సరూ జీవితం చక్కబడుతుంది... ఇక భయంలేదు — ఆమె — తన ప్రకృత కష్ట జీవితమనే చీకటి సరిహద్దుల్లో ఓ యాశాకిరణమును (తెల్లని వెలుగు!) అనివార్యముగా చూడగలుగుతూంది!... పిచ్చిపిల్లగాని, పీకమీదకు వచ్చిన తరువాతగూడా వుత్తరంయుక్క వ్రాసుకోరుటండీ? —"

"ఆదే — తెలివితక్కువ!... తానా విధంగా వ్రాసి వారికి భౌతికంగా నొప్పి కలిగిస్తే — తన ఇహపరములలో ముక్తియుండదని సరు యభిప్రాయం!" అన్నాను.

"పిచ్చిపిల్లాను, పిచ్చివూహాలును!... తండ్రి సరుపట్ల క్రూరంగా ప్రవర్తిస్తున్నాడే, వాడికి మాత్రం ఇహపరములలో ముక్తియుంటుందా యేమిటి? తండ్రి పూజ్యుడైనప్పుడు — అతణ్ణి దేముడు మల్లే పూజించాలి; లేనప్పుడు — తండ్రి క్రూరుడైనప్పుడు, అతనికి తగినట్లుగా ప్రవర్తించాలికాని, B. C. భావాలతో సంచరిస్తే, కాలగర్భములో కనబడడమేగాని, మగలీ భూమ్మీద నివశించటం దుర్లభం — కష్టసాధ్యం! తండ్రిగాని, భర్తగాని మంచివాడు కానప్పుడు, క్రిందటి యుగములలో పూజించేవారు. అది ఆ యుగధర్మం; వారలా ఆచరించారని మన మీయుగంలో యాచరించగలమా? మన యుగధర్మప్రకారం నడవాలి... యీ యుగంలో — ఎవరివల్ల తప్పుంటే — వారిని దయారహితంగా నానాహింసలు పెట్టాలి, అలాచేసినపుడే మన ఇహపరములలో — కలియుగ స్వర్గములో ముక్తిలభిస్తూంది. అందుకు — యీ కాలంలో 'రాజేశ్వరరావ్' వంటి వ్యక్తులు కొన్ని సంసారములలో యెంతైనా అవుసరం —!"

—(o)—

# "ఎన్నికలు"

శ్రీమతి మల్లవరపు హనుమాయమ్మ

మానవులలో స్త్రీ, పురుష భేదమేకాక, వారిమధ్య యోగ్యతలలోను, విద్యలోను భేదములు కలవు. పురుషుడు సంపాదించుటయందు, తన చాతుర్యమును చూపి, కీర్తి, గౌరవముల సంపాదించుచుండెను స్త్రీ పురుషునికి ఆహారాది సౌకర్యములను, కలుగ చేయుచు, ఇంటియందేయుండి గృహనిర్వహణము, శిశుపోషణము, మొదలగు పనులను చేయుచుండెడిది.

సామాన్యముగ స్త్రీకి, గృహముతప్ప, బాహ్య ప్రపంచము తెలియకుండెను. రాజవంశములో నుండెడిస్త్రీలు, రాజనీతియందు నిపుణులై, తమ భర్తలకు, యుద్ధ విధానములయందు ప్రోత్సహించుచుండిరి. పల్నాటిచరిత్రలో స్త్రీ పాలించినట్లుకూడ మనము వినుచున్నాము.

ఆంగ్లేయులు, హిందూదేశమును పరిపాలించునట్టి ప్రారంభదశలో, రాజారామ మోహనరాయ్ స్త్రీల విషయమై మిక్కిలి పాటుపడి, సహగమనమును నిలిపి, వారినే విధముగ ప్రోత్సహించెనను విషయము, మనకెల్లరకును తెలిసినదే! శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు కూడ, స్త్రీల అభివృద్ధికై మిక్కిలి పాటుపడిరి.

మఱియు, స్త్రీలును విద్యకు, అర్హులే అనియు వాదించి, స్త్రీ విద్యను వ్యాపింప చేసిరి. ఆనాటి మొదలు స్త్రీలు, ఎక్కువగా చదువకున్నను, కొద్దిగా మాత్రమునైనను చదువు కొనుచుండిరి.

కాలచక్రము చాలవేగముగా తిరిగిపోవుచున్నది. స్త్రీలు, పురుషులతోపాటు, పాఠశాలలలోను, కళాశాలలలోను, ప్రవేశించి విద్యను గడింపసాగిరి. రానురాను స్త్రీలలో, అనేకులు విద్యావంతులుగా నేర్పడి, ఉద్యోగములు చేయుటకు అర్హతలుకూడ సంపాదించుకొనిరి. ప్రస్తుతం స్త్రీలలో ఆఫీసులలో గుమాస్తాలుగాను, డాక్టర్లు, అడ్వకేటులు గాను ప్రబలియున్నారు.

పాశ్చాత్య సంపర్కమువలన, భారతదేశములోని స్త్రీలు, పురుషులతోపాటు, సమాన హక్కులు గలవారలు, అను అభిప్రాయము గాఢముగా ఇప్పుడు ఎల్లెడలను వ్యాపించియున్నది. విద్యలోను, యోగ్యతలోను, సమాన ప్రావీణ్యము సంపాదించుచున్న స్త్రీలు, రాజకీయ రంగములలో కూడ ప్రవేశింప మొదలిడిరను విషయమును గురించి

ప్రతి భారత స్త్రీయు గర్వింపదగిన విషయమేను. రాజకీయ రంగములలో రానురాను స్త్రీలకు గౌరవమును, హక్కులును, ఏర్పడినవి. తరువాత వారు తమతమ హక్కులను కాపాడుకొని, నిలబెట్టుకొనుటకై పూనుకొన సాగిరి. అట్టి హక్కులలో ఎన్నికలు మొదటివి.

మానవకోటిలో స్త్రీ జనాభా పురుషులతో ఇంచుమించు సమానముగనుండు టచే నవీనయుగమున స్త్రీలకుకూడ, అన్ని రంగములలోను సమాన ప్రాతినిధ్యము ప్రతిపాదింప సాగిరి. కాబట్టి స్త్రీలకు ప్రత్యేకముగా నియోజక వర్గములు, ఏర్పడెను.

ఇట్టి పరిస్థితులలో స్త్రీలు తప్పక ఎన్నికలలో పాల్గొనుటకు అవసరమేర్పడెను. స్త్రీలు, ఎన్నికలలో ప్రవేశించి, కడతేరినగాని, స్త్రీల హక్కులు సురక్షితముగా నుండవనియే చెప్పవలయును. ప్రస్తుతం మన భారతదేశపు స్త్రీలు, సకలవిధముల, పురోగమింప వలయును.

స్త్రీలకు విద్య, వృత్తులు, వైద్యశాలలు, శిశుపోషణము, మొదలగు అనేక అనుకూలములు చేయవలసియున్నవి. ఇట్టి సదుపాయములు ప్రభుత్వమువారు చేయవలసి యున్నను, వారికి తగిన విధమున, సలహాల నిచ్చుటకు తగిన ప్రతినిధులను పంపవలసి యున్నది.

స్త్రీలకు ఎట్టి సదుపాయములు చేయవలయునో వాటిని ప్రతినిధుల మూలము నవే ప్రజలు తెలుపవలయును. పాశ్చాత్య దేశములలో, పురుషులతోబాటు స్త్రీలును ఏవిధముగా ఎన్నికలలో పాల్గొనుచున్నారనునది మనము వినుచున్నాముకదా!

మేమేమి హెచ్చుగా శాసన సభ్యురాండ్రమవుతామా? మంత్రిణుల మవుతామా? అని అనుకోరాదు. ఓటు విలువ తెలిసి, తెలివిగా ఓటిస్తే అంతేచాలు. ఎన్నాళ్ళనుంచో పార్లమెంటరీ ప్రభుత్వం అనుభవిస్తూన్న ఇంగ్లాండులోనైనా, ఇటీవల జరిగిన ఎన్నికలలో 1800 అభ్యర్థులకు 120 మందే స్త్రీలు. వీరిలో ఎందరు నెగ్గారో! అసలు సీట్లు 625. అయితేనేం, అక్కడ స్త్రీలు తెలివిగా ఓటువిలువ గ్రహించి ఓట్లు ఇస్తారు. మంత్రులకు, వారి నేర్పరచే పార్టీలకు, ఆడవాళ్ళను, వోట్లు అర్థించవలెననే స్పృహవుంటుంది. కాబట్టి వారు స్త్రీల అభిప్రాయాలను, అవసరాలను గుర్తించి ఎన్నెన్నో వారి పురోభివృద్ధి కవసరమైన, చట్టాలు ప్రవేశపెట్టి, గృహలక్ష్మి జీవితాన్ని సుఖవంతం చేస్తున్నారు.

అట్లే మనదేశములోను స్త్రీలు, ఎన్నికలలో పాల్గొనుట అత్యావశ్యకము. అట్లు పాల్గొనుటవలననే ఇప్పుడు శాసన సభలలో, స్త్రీలకు ప్రత్యేక నియోజక వర్గములు ఏర్పడినవి. పురుషుల స్థానములలోకూడ, స్త్రీలు పోటీచేసి, స్త్రీ ప్రాతినిధ్యమునే బలపరచవచ్చును.

మొట్టమొదట, చిన్న చిన్న సభలలో పాల్గొనవలెను. ఇట్టి సభలే గ్రామములలో, పంచాయితీ సభలని పిలువబడుచున్నవి. గ్రామములలోని ఎన్నికలు జరుగునప్పుడు, స్త్రీ ప్రాతినిధ్యముయొక్క ఆవశ్యకతను, గ్రామములోని ప్రతి గృహము నందుండు స్త్రీకి తెలియునట్లు ప్రచారం చేయడం చాల మంచిది. ఇట్లే పురపాలకసంఘ ఎన్నికలలోను, జిల్లాబోర్డు ఎన్నికలలోను, కార్పొరేషన్ ఎన్నికలలోను, రాష్ట్రీయశాసన సభల ఎన్నికలలోను, స్త్రీలు తప్పక పాల్గొనుట మంచిది. చాలమంది స్త్రీలకు, అందులో ముఖ్యముగా వయోజనులకు, ఎన్నికల తత్వమును బోధించవలెను.

స్త్రీలు తమ ప్రతినిధులను పైవాటికి ఎన్నుకొనుటలో, వారివారి విద్యాయోగ్యతలు మొదలగునవి యోచించి, స్వార్థపరులుగాని వారల ఎన్నుకోవడం ఉత్తమం. అట్లు తగిన స్త్రీని, తమ ప్రతినిధిగ నేర్పరచుకొనుటలోను వివేకము చూపునంతటి శక్తినికూడ స్త్రీలలో కలుగచేయడం మంచిది. అప్పుడే ఎన్నికలలో తగినట్టి స్త్రీలు ప్రవేశించి, ఆదర్శ స్త్రీ ప్రతినిధులుగ తయారగుదురు. అట్టివారే, స్త్రీ లోకమునకు పాటుపడగలరు.

కాబట్టి భారతదేశమున, స్త్రీలందరు రాబోవు ఎన్నికలలో పాల్గొని, పరిపాలనా సభలకు, తగిన తమ ప్రతినిధుల పంపినచో, మొత్తముమీద స్త్రీలు, బాగుపడుదురనుటకు సందియములేదు.

రాబోవు ఎన్నికలలో గృహలక్ష్ములందరు తమ పాత్రను సూక్ష్మబుద్ధితో గ్రహించి, ప్రవర్తించుట స్త్రీలోకమునకేకాక, ఎల్లరకు మిక్కిలి లాభదాయకము.




గ్రహణికి:- (1) గోధుమగింజ ఎత్తు నల్లమందు నీరుల్లిపాయ మధ్యనుబెట్టి కొంచెము వెచ్చజేసి పుచ్చుకోవలెను.

(2) సజ్జగింజలు నీళ్లలోనానవేసి ఉబ్బినపిమ్మట పంచదార కలిపి త్రాగవలెను.

(3) పాలగుండ తిమ్మనంచేసి భుజించవలెను.

(4) సపోటా కాయ రసముతీసి త్రాగవలెను.

(5) పెరుగు అన్నం తినవచ్చును.

(6) ధనియాలు కషాయముతో తేనెకొంచెంకలిపి త్రాగుటవలన ఉపశమించును.

కాలిన పుండ్లకు:-కరక్కాయ, తాడికాయ, వుశిరికాయ కాల్చినమసి నువ్వులనూనెతో కలిపి రాయవలెను.

తేనెగుణము:-రాత్రి పరుండబోవుముందు గ్లాసునీళ్లలో 2 చెమ్చాలు తేనె కలిపి త్రాగిన గాఢనిద్ర పట్టును. జీర్ణకోశవ్యాధులు నివారణ యగును. ఉబ్బసము పోగొట్టును. కాలినపుండ్లకు తేనె రాసిన త్వరగా మానును. బొగ్గుపొడియందు తేనె కలిపి పండ్లుతోమిన తెల్లగా ముత్యములవలె మెరయును. దంతరోగములు నశించును.

మ. వె. రమణమ్మ

# సినిమారంగము 

వరుణా పిక్చర్సువారి చిత్రం "మంజరి" చాలవరకు పూర్తి అయిందట. దర్శకులు వై. వి. రావు.

  

మాడరన్ థియేటర్సువారి "సర్వాధికారి" విడుదలయింది. నాగయ్య, అంజలిదేవి మొదలగువారు నటించారు.

  

"పాలేరు" చిత్రాన్ని టి. కె. ప్రొడక్షన్సు వారు చురుకుగా నిర్మాణం సాగిస్తున్నారు. సగం చిత్రం పూర్తి అయినట్లు వార్తలు. దర్శకుడు గోపీచంద్. ఇందులో ముఖ్యనటి జానకి.

  

"చంద్రహారం," "పెండ్లిచేసి చూడు" అనే చిత్రాలను శ్రీ బి. నాగిరెడ్డి, చక్రపాణిగారలు నిర్మించ పూనుకొన్నారు. వీనినిర్మాణం వాహినీ స్టుడియోలో జరుగుచున్నది. నిర్మాతలు సిద్ధహస్తులగుటచే చిత్రముల విజయ యాత్రకు సందేహముండదు.

  

ప్రఖ్యాత సినిమానటి శ్రీమతి అంజలీదేవి అంజలీ పిక్చర్సు అనే పేరుతో "పరదేశి" అనే చిత్ర నిర్మాణానికి పూనుకొన్నది. ఈ సంస్థ శ్రీ ఆదినారాయణగారి యాజమాన్యమున నిర్వహించబడుతుంది. ఈ చిత్రానికి దర్శకుడు శ్రీ యల్. వి. ప్రసాద్. శ్రీ ఆదినారాయణ సంగీత దర్శకుడు.

  

శ్రీ చిత్తూరు నాగయ్యగారు నటులు, దర్శకులుగానుండి "నా యిల్లు" అనే చిత్రాన్ని తీస్తున్నారు. శ్రీ నాగయ్యగారిచే స్థాపించబడిన "అవర్ ఇండియా ఫిల్మ్సు" వారు యీ చిత్రనిర్మాతలు. ఇందు రాజకుమారికూడ నటిస్తున్నది.

  

భరణీ పిక్చర్సువారి "ప్రేమ" అనే చిత్రం దాదాపు పూర్తికావస్తున్నదని వార్తలు.

  

"దీక్ష" చిత్రం తమిళ ఆంధ్ర భాషలలో విజయ యాత్ర సలుపుతూ యున్నది. ప్రజలు తండోపతండాలుగా చూచి ఆనందిస్తున్నారు.

  

జాగృతిస్టుడియోవారు "కాపురం" అనేచిత్రాన్ని బొంబాయిలో నిర్మిస్తున్నారు. ఇందు సి. హెచ్. నారాయణరావు, కనకం నటిస్తున్నారు.



# ‘రాజ్యం ప్రతిభ’



శ్రీమతి దే. జయలక్ష్మి

సూర్యోదయమింకా సరిగ్గా కాకముందే యా‘వార్త’ యూరంతయు పాక్కిపోయింది. జనులు గుంపులు గుంపులుగా నారాయణరావుగారి గృహము చెంతకు పరిగిడుచుండిరి. అందరాశ్చర్యముతో జరిగిన ఘోరమునుగూర్చి “ఇదెవ్వరుచేసిరి? ఎట్లుచేసిరి? ఎప్పుడుచేసిరి?” అని యొకరినొకరు ప్రశ్నించుకొనుచు యాఘోర దృశ్యమును కాంచు కుతూహలముతో నొకరికంటే నొకరు ముందుగా వారియిల్లు సమీపించుచుండిరి.

‘ఏమాఘోరము?’ ‘హత్య.’ పదునారేండ్ల జవ్వనియగు ‘శకుంతల’ ‘హత్య’ గావింపబడినది. ఆ జన ప్రవాహమును త్రోసికొనుచు నలుగురు రక్షకభటులును, పోలీసు యినస్పెక్టరును వెంటరా పత్తేదారు ‘ప్రకాశరావు’ హడావుడిగా ప్రవేశించెను. పత్తేదారుని కాంచగనే, నారాయణరావుగారొక్క పెట్టున బిట్టుగా విలపించిరి. ఆయన దుఃఖము కాంచగనే ప్రకాశరావుగారికికూడ కండ్లవెంబడి నీరువచ్చెను. ఆయన తన కండ్లనీరు కరవస్త్ర సాయమున తుడుచుకొనుచు శకుంతల గదిచెంతకు నడచెను.

శకుంతల తన గదియందుగల మంచముమీదనే పరుండియుండెను. ఆమె హృదయమునందొక ‘బాకు’ గ్రుచ్చబడి యుండెను. ప్రక్కనే యొక కరవస్త్రముగూడ బడియుండెను. ప్రక్కనేగల యొక మేజామీద కొన్ని పుస్తకములు, కలము, సిరాబుడ్డి మొదలగునవన్నియుకలవు. డిటెక్టివ్ ప్రకాష్ అంతయు పరిశీలించి నారాయణరావుగారున్న గదిలోనికివచ్చెను. ఆయనయు ప్రకాశరావుగారిని, పోలీసు యినస్పెక్టర్ ప్రసాదరావుగారినికూడా కూర్చుండబెట్టెను. అంత ప్రకాశరావు నారాయణరావుగారితో “అయ్యా! నేనడుగు ప్రశ్నలకు ముందు జవాబు చెప్పు”డనెను.

నారాయణ:—అడుగునాయనా! తెలిసినంతవరకు జెప్పెదను.

ప్రకాష్:—ఆమె రాత్రి యెన్ని గంటలకు శయనించినది?

నారాయణ:—షుమారు తొమ్మిది గంటలకు.

ప్రకాష్:—తరువాత మీకేవిధమయిన శబ్దముకానీ వినబడినదా?

నారాయణ:—లేదు. రెండుగంటల కాలమున సీతయ్యకు శకుంతల గదిలో నేదో యలికిడి వినిపించినది.

ప్రకాష్:—ఆ సంగతి నాతడెవరితో చెప్పెను?

నారాయణ:—రాజారావు బయటికి వచ్చినప్పుడు చెప్పెను.

ప్రకాష్:—మీరీదృశ్యము నెపుడు కాంచితిరి?

నారాయణ:—మూడుగంటల కాలమున.

ఇంక నాతడిట్లందరినీ ప్రశ్నించి ప్రసాదరావుతో యేదో మాట్లాడెను. ఆయనయు నారాయణ గారితో “ఆమెకెవ్వరూ శత్రువులు లేరుగదా!” అనెను. ‘లేరు’ అని ఆయన జవాబిచ్చెను. ఈ విధముగ వారిద్దరు ప్రసంగించుకొనుచు తమ గృహములకేగిరి.

శకుంతల నారాయణరావుగారి ఏకపుత్రిక. నారాయణరావుగారు గొప్పధనవంతులు. పేరుగల న్యాయవాదులు. శకుంతల చిన్నతనముననే తల్లిని కోల్పోయి మేనత్తయగు రుక్మిణమ్మగారి పెంపకముననే పెరిగెను. రుక్మిణమ్మగారికి రాజారావను కుమారుడుకలడు. తండ్రి లేనందువలన రాజారావు మేనమామ యింటియందేయుండి చదువుకొనుచుండెను. అతడిరువది సంవత్సరముల యువకుడు.

పత్తేదారు ప్రకాశరావు తన యింటికివచ్చి యాహత్యా విషయమై యాలోచించుచుండెను. ఇంతలో యాతని ధర్మపత్నియగు 'రాజ్యలక్ష్మి' హడావుడిగా ప్రవేశించి 'ఏమండీ మన శకుంతల నెవరో హత్యగావించిరట. ఎవరట్లు గావించిరి? ఎప్పుడు? చెప్పండీ త్వరగా?' అని యాతనిమీద ప్రశ్నల వర్షము కురిపింపసాగెను. అతడు నవ్వుతూ రాజ్యం! అంత తొందరెందుకు? శకుంతల నెవరో హత్య గావించినది నిజమే. ఎవరు చేశారో అప్పుడే ఎల్లా తెలుస్తుంది? రాత్రే హత్యజరిగిందని నిదానముగా ఆమె ప్రశ్నలకు జవాబులిచ్చెను. ఆమె యాసమాధానములతో తృప్తిపడక 'సరే భోజనానికి లేవండి' అంటూ లోపలికెళ్ళిపోయెను. ప్రకాశరావును ఆమెవెంట లోపలికెళ్ళెను.

రాజ్యలక్ష్మి ప్రకాశరావున కనుకూలపు టిల్లాలు. చిన్నప్పటినుండియు బస్త్రీలలోయుండి యస్. యస్. యల్. సి. పరీక్షలో నుత్తీర్ణురాలై ప్రకాశరావును ఏరికోరి పెండ్లిజేసికొనెను. ఆమెకు తాను గూడ తన భర్తవలెనే అపరాధులను పట్టవలెనన్న నమిత యుత్సాహము. ప్రకాశరావుగూడ అందుకుతగిన ప్రోత్సాహమిచ్చుచుండును. శకుంతల, రాజ్యలక్ష్ములు ప్రాణస్నేహితురాండ్రు. ఒకరియిండ్లకొకరు తరుచుగా వచ్చుచూ పోవుచూ యుండిరి. ప్రాణస్నేహితురాలి హత్యకు రాజ్య మెంతయో దుఃఖించెను.

శకుంతలహత్యజరిగి దాదాపు పదిహేను దినములయ్యెను. ఒకనాడు సాయంకాలము ప్రకాశరావు సంతసమున యింటికివచ్చి 'రాజ్యం!' అని పిలచెను. రాజ్యలక్ష్మియు 'ఎందుకండీ పిలిచారు?' అనుచూ అచ్చటకొచ్చి యొక కుర్చీమీద కూర్చుండెను. ప్రకాశరావును యొక సోఫామీద కూర్చుండి 'రాజ్యం! శకుంతలా హంతకుడు నేటికి దొరికాడు. ఇంత సులభంగా దొరకుతాడనుకోలేదుసుమా!' అనెను. అంత రాజ్యం అత్యాతురతతో 'ఎవరు?' అనెను. ప్రకాష్ 'ఇంకెవ్వరు? వారియింటి సేవకుడు సీతయ్యయే హంతకుడు.' రాజ్యం 'ఎట్లు?' 'ఎట్లేమిటి? వాడు పేదవాడు. రాత్రిపూట నారాయణగారి గృహము ననే పడుకొనును. శకుంతల శరీరము ననేకాభరణములుకలవు. వాని నెట్లైనా అపహరింపదలచెను. వాడామెగది ప్రవేశించుసరికి శకుంతలకు మెలకువకలిగెను. వెంటనే యాతడామె మొఖముమీదకు తన చేరుమాలను విసరెను. ఆమె స్మృతిలేకుండా పడిపోయెను. అంతవాడు భయపడి తన చేతియందుగల బాకుచే ఆమెను చంపెను. వెంటనే రాజారావు లేచిన శబ్దముకాగా గుట్టుచక్కగాపోయి పడుకొని రాజారావుతో శకుంతల గదియందేదో శబ్దము వినపడినదని చెప్పెను. అందరూ లేచిచూచిరి. ఆ అర్ధరాత్రి సమయమున వీడికి మెలకువ వచ్చుటకు కారణమేమి? అందరూ అనుమాన పడుదురేమోయని తానుగూడ విచారము నటించెను. అంతేకాదు. ఆ 'బాకు' మీద నాతని పేరు 'సీతయ్య' యను నక్షరములుకలవు. ఆ కరవస్త్రము శకుంతలదే. ఆమెదెట్లో దొంగిలించి యీ కృత్యమొనర్చినాడు తెలిసిందా? ఇంకా విపులం జెయ్యాలా?' అని పత్తేదార్తన్ని విషయములు రాజ్యలక్ష్మితో చెప్పెను.

రాజ్యలక్ష్మి కొంత ఆలోచించి 'ఏమండీ సీతయ్యయే హంతకుడనుటకు నామనసంగీకరింపకున్నది. అతడు నిర్దోషి. ఇంకొకడెవరో యీపనిజేసి యీతనిమీద పెట్టినట్లు నాకు తోచుచున్నది. కాన నేను

మీవాదన యొప్పుకొనను' అనెను. అంత ఆగ్రహముతో రాజ్యంవంక చురచుర జూచుచు ప్రకాశరావు 'రాజ్యం! ఎన్నో నిగూఢమైనట్టియు, అతిభయంకరమయినట్టియు హత్యలెన్నో భేదించినాను. నేనొనరించిన దానినే తప్పనుచున్నావా? నీవు అపరాధ పరిశోధకులమీద అపరాధ పరిశోధ కాధ్యక్షురాలవుగానున్నావే!' అనెను. అంత రాజ్యం 'ఏమోనండీ! సీతయ్య పెద్దవాడు. అనుభవశాలి. అతడు చిన్నతనమునుండియు శకుంతలను తన చేతులార ఎత్తుకొని పెంచినాడు. ఆమెయనిన యతనికి పుత్రికాప్రేమకలదు. ఆమెకు కూడ సీతయ్యయెడ యమిత విశ్వాసము. కాన యీ పనిని యాతడొనర్చియుండడు. ఇంకెవరో చేసియుండవలెనని నాకు తోచుచున్నది. ఏమంటారు!' అనెను. ప్రకాష్ ఆమెమాటలాలించి 'రాజ్యం! నీ అతి తెలివితేటలకు నేను అతీగా సంతోషించాను. సరే! నీవు చెప్పినట్లే యొప్పుకొంటాము. ఆ యింకొకడెవరో చెప్పరాదూ? వెళ్ళి బంధించుకొని వస్తాను' అనెను. రాజ్యంలేచి 'ఏమోనండీ డిటక్టీవ్ ఆఫీసర్ గారు మీరే పట్టుకోవాలిగాని, నాకేమి తెలుసు? సీతయ్య విచారణ వాయిదావేయించండి. ఇదే మన పందెం. చూద్దాం. మీరు గెలుస్తారో. నేను గెలుస్తానో?' అని లోనికి వెళ్ళిపోయెను. ప్రకాష్ ధృఢ నిశ్చయముతో "ఎల్లాగైనా రాజ్యమే యోడిపోతుంది. నేనే గెలుస్తాను." అనుచూ షికారుకై లేచెను.

ఆ మరునాటి సాయంకాలము నాలుగు గంటలకు రాజ్యలక్ష్మి రుక్మిణమ్మగారి నోదార్చుటకై వారి గృహమునకేగెను. రుక్మిణమ్మగారును ఆమెను చూడగనే రమ్మనమని కూర్చుండపెట్టెను. ఇద్దరును శకుంతలనుగూర్చి ముచ్చటించుకొనిరి. అంత రాజ్యలక్ష్మి, రుక్మిణమ్మగారితో శకుంతలకు దినచర్యవ్రాయు నలవాటు కలదనియు నా పుస్తక మెచ్చట కలదనియు నడిగెను. ఆమె తనకావిషయమే తెలియదనియు శకుంతల పుస్తకాల బీరువాలో కలదేమో వెదుకుదుమనిచెప్పి తాళపుచెవుల గుత్తిగొనివచ్చి బీరువాను తెరచిచూపెను. అన్ని పుస్తకములనువెదకి ముత్యములబోలు నక్షరములతో నొప్పియున్న డైరీనిచూచి రాజ్యం యుత్సాహంతో తీసికొనెను. పాపం రుక్మిణమ్మగారికి శకుంతలమాట జ్ఞాపకమురాగానే కళ్ళు నీళ్ళతో నిండెను. ఆ సమయమున రాజారావు గదిలోనికి వచ్చెను. రాజ్యలక్ష్మిని, ఆమెచేతియందలి పుస్తకమునుచూచి యాతనిమోము ఆశ్చర్యభరితమయ్యెను. రాజ్యలక్ష్మి అది గ్రహించెను. రాజారావు రాజ్యలక్ష్మితో 'ఏమండీ శకుంతలకు దినచర్యవ్రాయు నలవాటుకలదా? యని ఆశ్చర్యముతో ప్రశ్నించెను.' రాజ్యమును 'అవునండీ శకుంతల నాతో చెప్పుచూయుండెడిది తాను దినచర్య వ్రాయుదునని, అందుకని ఆనాడేమైనా ఆమె కనిష్టములగు పనులేవైనా జరిగినవేమోయని చదువుదామని తీసుకెళ్లుచున్నా'ననెను. 'నాకాపుస్తక మివ్వండి చదివి యిస్తాను' అని రాజారావడిగెను. కాని రాజ్యలక్ష్మి "నేను చదువుతా నివ్వాళ. రేపు తెచ్చి యిచ్చెద"నని చెప్పి, యింటికి వెళ్ళెను.

ఆ రాత్రియే రాజ్యం తాను తెచ్చిన పుస్తకమును ఏకాగ్ర చిత్తముతో మొదటినుండియు చివరిదాక జదివెను. అందుగల విషయములన్నియు చదివిన యనంతర మామె ఆశ్చర్య నిమజ్ఞయయ్యెను. మరునాడామె అలవాటు ప్రకారము రుక్మిణమ్మగారి యింటికివెళ్ళి యింకనూ యితర విషయములెన్నో మాట్లాడి తన యింటికి వచ్చెను. ఆమె యిట్లస్తమానము ఆలోచనా నిమజ్ఞయగుటచే ప్రకాశరావామెను ఎగతాళి జేయుచూ ఆమె ఓడిపోవునను నిశ్చయముతో నుండెను.

సీతయ్య విచారణరేపను దినమున రాజ్యలక్ష్మి ప్రకాశరావును కూర్చుండబెట్టి శకుంతల డైరీని చూపెట్టి యందలి విషయములన్నియు విస్తరించి చెప్పెను. ప్రకాష్ ఆమె మాటలు నమ్మక అడ్డదిడ్డములుగా

ప్రశ్నలు వేయసాగెను. రాజ్యలక్ష్మి అన్నియువివరించి, సరియగు సమాధానములుచెప్పి హంతకుడెవరో చెప్పెను. ప్రకాష్ అన్ని విషయములు వినినపిదప రాజ్యలక్ష్మి అపారమేధస్సుకు ఆశ్చర్య నిమగ్నుడై అత్యంత సంతసమున 'రాజ్యం! నీవే గెల్చావు. మరి స్త్రీలు శక్తిస్వరూపిణులుగాదూ?' అని నవ్వెను. ఆ సమయమున వారింటిముందు యొక వ్యక్తి అటు, నిటు తారట్లాడుచుండెను. రాజ్యం తటాలున ఆ వ్యక్తిని చూపెట్టి ప్రకాశరావునకు శకుంతలా హంతకు డీతడేయని చెప్పెను. ఆ వ్యక్తి ఎవరో ప్రకాష్ సులువుగా పోల్చుకొనెను. ఇద్దరునూ ఆ విషయమునే చాలసేపు ప్రసంగించుకొనిరి.

ఆ మరుసటి దినముననే ప్రకాష్ వారంటుతో, సంకెళ్ళతో, రక్షక భటులతో నారాయణరావుగారి గృహమునకేగెను. నారాయణరావుగారు ప్రకాష్‌ను కూర్చుండమనిచెప్పిరి. కుశలప్రశ్నల యనంతరము ప్రకాష్ 'రాజారావెక్కడ'ని ప్రశ్నించెను. ఆయనయు 'మేడమీదయున్నాడు కాబోలు. శకుంతల హత్య యనంతరము నుండియు వానిమనస్సు సరిగాలేదు.' అనుచూ 'రాజా! రాజా!' అని మేడ వైపు దృష్టినిల్పి పిలచెను. వెంటనే 'ఎందుకు మామయ్యా!' అనుచూ రాజారావు క్రిందకువచ్చెను. ప్రకాష్‌ని చూడగనే రాజారావతి వినయముతో ప్రభాతవందన మాచరించి తానునూ యొక కుర్చీమీద కూర్చుండెను. ప్రకాష్ అతనిముఖకవళికలు, ప్రవర్తన, జాగ్రత్తగా పరిశీలించుచూ 'రాజారావు! శకుంతల హత్యనాటినుండియు నీ మనస్సు సరిగాలేదుకదూ! పాపం ఎంత చిక్కిపోయావు?' అనెను. రాజారావా మాటల కులిక్కిపడెను. మోము వెలవెలపోయెను. ధైర్యము చిక్కబట్టి 'అయ్యా! ఆ మాట నిజమే! మా శకుంతలా హంతకుడు సీతయ్యయని మీరు తెలుసుకున్నారుగా. అహా! ధనమెంతపనియైనను జేయు గదా! సీతయ్యను మేమంతా ఎల్లా ప్రేమించేవారమో మీకుగూడా తెలుసు. ప్రక్కలో పాముండగా తెలుసుకొనలేకపోయ్యాము. నిజంగా మీబుద్ధి కుశలత పొగడ నెవరితరము?' అని ఎంతయో విచారముతో పలికెను. నారాయణగారును పుత్రికా మరణము జ్ఞాపకమురాగా కళ్ళనీళ్ళు పెట్టుకొనిరి. ప్రకాష్ యిది చూచి వారితో 'మీరిద్దరూ యిట్లేడ్చుచున్న నేను వచ్చినపని ఏమగును? నేను చేయవలసినపని అయిన తర్వాత అన్ని విషయములు చూచుకొందమని గంభీరముగా' పల్కెను. అంత నారాయణగారు 'మీరువచ్చిన పనియేమ'ని యడిగిరి. వెంటనే యతడు తనచేతనున్న వారంటుచూపి, తన చేతనున్న యీలను వేసెను. వెంటనే నలుగురు రక్షకభటులువచ్చి రాజారావు చేతులకు సంకెళ్ళు దగిల్చిరి. రాజారావతి భయముతో 'అ అ అ అయ్యా! యియిదేమి?' అనుచూ వారి బారినుండి తప్పించుకొని పారిపోవజూచెను. కాని యది యసాధ్యమయ్యెను. నారాయణగారి కిదంతయు అయోమయముగానుండి, ఏమియూతోచక నిర్ఘాంత పడి చూచుచుండిరి. ఈ గందరగోళమునకు లోనున్న రుక్మిణమ్మగారు వెలుపలికొచ్చి తన పుత్రునికాంచి 'రాజా! అదేమిరా!' అనుచూ ఏడువదొడగెను. అంత నందరినీ సమాధానపరచుటకై ప్రకాశరావు 'అయ్యా! శకుంతలా హత్యా నేరమున రాజారావునుపట్టి బంధించుచుంటిని. మీరెవరూ యిప్పుడింకెట్టి ప్రశ్నలు వేయరాదు. ఇది ప్రభుత్వం ఆజ్ఞ' అనెను. వెంటనే నారాయణగారు 'ప్రకాశరావుగారూ! ఇదెక్కడయినాతగునా! ఏరికోరి పెండ్లాడదలచిన మా శకుంతలను రాజారావెందులకుహత్యయొనర్చును? ఆ సీతయ్యే యీ పనిజేసి మా రాజా మీద పెట్టినట్లున్నది. రాజా నిరపరాధి' అని యింకేమో యనబోవుచుండగా ప్రకాష్ అధికార స్వరమున "అయ్యా! నేడు 11 గం||లకు న్యాయస్థానమునందంతయు తేలగలదు." యని పోలీసు స్టేషన్‌కు దారితీసెను.

(సశేషము)

# లోకవార్తలు



ఇండియా, బర్మా దేశాల మధ్య ఐదేండ్ల వ్యాపార ఒప్పందం జరిగింది. దానిమూలంగా బర్మాదేశం 5 సంవత్సరములు బియ్యము మొదలైన అవసర పదార్థములను ఇండియాకు పంపుతుంది. దానికి బదులుగా నూలుగుడ్డలు, జనపనారవస్తువులు, బొగ్గు మొదలైన వస్తువులను ఇండియా పంపుతుంది.

◆ ◆ ◆

ఆచార్య వినోభావే గాంధీజయంతి సందర్భమున ఉపన్యసించుచు భూదాన యజ్ఞానికి అధమపక్షం 5 కోట్ల ఏకరాల భూమిని సేకరించ సంకల్పించ దలచినట్లు ప్రకటించాడు.

◆ ◆ ◆

కాంగ్రెస్ నుండి రాజీనామానిచ్చిన రఫీ అహమద్ కిద్వాయి కాంగ్రెస్ కార్యవర్గ పునర్నిర్మాణము జరిగినందువలన దేశక్షేమ దృష్ట్యాతాను, మరికొందరు కాంగ్రెస్‌లో పునః ప్రవేశించ దలచినట్లు ప్రకటించాడు.

◆ ◆ ◆

న్యాయశాఖ మంత్రి శ్రీ బి. ఆర్. అంబేద్కరు రాజీనామాను ప్రధానమంత్రి అంగీకరించాడు. అక్టోబరు నెలాఖరున శ్రీ సి. రాజగోపాలాచారి కూడ మంత్రి పదవినుండి విరమించెదరు.

◆ ◆ ◆

వర్షాభావంవలన రాయలసీమ, గుంటూరు మెట్ట తాలూకాలలో వేసిన పైర్లు ఎండిపోయి క్షామస్థితి ఏర్పడింది.

◆ ◆ ◆

పర్షియాలో ఏర్పడిన నూనెతగాదాను సమితి భద్రతామండలికి నివేదించడానికి బ్రిటిషు ప్రభుత్వం నిశ్చయించింది.

◆ ◆ ◆

తృతీయ చెన్నరాష్ట్ర పంచాయితీల మహాసభ వారి సమావేశంలో పంచాయితీ అధ్యక్షుడే ఎక్జిక్యూటివు ఆఫీసరు కావలెననియు, వ్యయపరచే మొత్తాలను పెంచాలని తీర్మానించారు.

◆ ◆ ◆

సెప్టెంబరు నెల 26వ తేదీన మద్రాసుకు సమీపమున నున్న అంబత్తూరులో సైకిలు ఫాక్టరీని మద్రాసు గవర్నరుగారు ప్రారంభించారు.

* ◆ ◆

సెప్టెంబరు నెల 26వ తేదీన ఆలిండియా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగానుండి విరమించుకొన్న శ్రీ కళా వెంకటరావుగారు ఆరోగ్యశాఖా మంత్రిగా నియమించబడ్డారు.

◆ ◆ ◆

గాంధీజీగారి ప్రార్థన ప్రవచనాలను రికార్డుచేసిన ఆలిండియా రేడియోవారు వాటన్నిటిని గ్రామఫోను రికార్డులుగా తయారుచేయించి అమ్మటానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

◆ ◆ ◆

బీదలకు భూములు పంచిపెట్టడానికి భూదానాలను స్వీకరిస్తున్న సందర్భంలో ఆచార్యవినోభావేకు 12 ఏళ్ల బాలుడు 10 ఎకరాలభూమిని దానం చేశాడట.

మధ్యభారత్ కాంగ్రెస్, ఎన్నికలలో బోర్డు సభ్యులకు సలహానిస్తూ దొంగవ్యాపారస్తులను ఎన్నికలలో అభ్యర్థులుగా నెన్నుకో గూడదనియు, కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో నిర్మించిన సాంఘిక ఆర్థిక పునర్నిర్మాణ విధానమును అంగీకరించినవారినే ఎన్నుకోవలెనని ప్రధాని నెహ్రూ చెప్పిరి.

♦ ♦ ♦

"1951 అక్టోబరు 2 తే॥ఆకెళ్ల సూర్యనారాయణ మహిళాభవనమునందు మధ్యాహ్నము 4. 30. గం॥ శ్రీ గాంధీగారి జన్మదినోత్సవము జరుపబడెను. సభకు సుమారు 200 మంది పురస్త్రీలు వచ్చిరి. శ్రీమతులు దిగుమర్తి జానకీ బాయమ్మగారు, సుందరమ్మగారు మహాత్ముని గూర్చి, నేటి స్త్రీల కర్తవ్యమును గూర్చియు, శ్రీ స్వామీ సీతారామ్‌గారి ఆంధ్రరాష్ట్ర ఉద్యమముగూర్చి విపులముగా, ఉపన్యసించిరి. తరువాత కుమారి గోపాలరత్నము అను 13 సం॥ బాలికచే "కృష్ణలీలలు" హరికథ రూపమున చెప్పబడెను. సభ సాయంత్రము 7 గం॥ మంగళ గీతములతో ముగిసెను."

♦ ♦ ♦

మద్రాసు రాష్ట్ర మొత్తముమీద గ్రామములో ప్రభుత్వము యిప్పటికి 1696 రేడియోసెట్లు స్థాపించింది.

♦ ♦ ♦

కమ్యూనల్ జి. ఒ. ప్రత్యామ్నాయంగా ఉద్యోగాలలో మద్రాసు ప్రభుత్వమువారు ప్రతి 20 ఉద్యోగాలకు ముగ్గురిని షెడ్యూలు జాతులు, కొండ జాతులనుండి, అయిదుగుర్ని వెనుకబడిన జాతులనుండి, మిగిలిన 12 గురిని అన్ని కులాల నుండి బహిరంగ పోటీద్వారా భర్తీ చేస్తారు.

♦ ♦ ♦

హిందూన్యాయశాస్త్ర సవరణ బిల్లుపై చర్చను ప్రస్తుతానికి వాయిదా వేస్తూ సెప్టెంబరు 26 వ తేదీన పండిత నెహ్రూ పార్లమెంటులో ప్రకటించాడు.

రాబోవు ఎన్నికలలో వివిధపార్టీలకు 25 చిహ్నములను ఎన్నికల కమీషనర్ ప్రకటించాడు. అందులో కొన్ని - కాంగ్రెస్ (కాడి క్రిందనున్న ఎద్దులు) కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ (కుటీరం,) సోషలిస్టుపార్టీ (వృక్షం) కమ్యూనిస్టుపార్టీ (కొడవలి, ధాన్యం కంకి.)

♦ ♦ ♦

మద్రాసుకు సమీపమున నున్న తాంబరం టి. బి. శానిటోరియమ్‌లో 40800 ఖరీదు చేసే ఆపరేషను లేబరేటరీ ఏర్పాటు చేయుటకు ప్రభుత్వము మంజూరు చేసింది.

♦ ♦ ♦

కీ. శే. శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు గారి మనుమరాలు శ్రీమతి శంకర చినమ్మారావు గారు ది 6.9.51 నాడు పరమపదించిరి.

# బాలలకు — బొమ్మలు

పెద్దవాళ్లకు, చిన్నపిల్లలకు మానసిక తత్వంలో చాలా భేదమున్నది. రుచులు భావాలు, ఉభయులవి ఒకే విధంగా నుండవు. పిల్లలు స్వాప్నికవాదులు. పెద్దలు వాస్తవిక వాదులు. శృంగార రసాలు పెద్దలకిష్టము. హాస్య, అద్భుతరసాలు బాలలకు అభిమాన రసాలు. అందుచేతనే చిన్నపిల్లలు విచిత్రవస్తువులను, అద్భుతదృశ్యాలను చూడడానికి చవి గోరుకుంటారు. ఈ విషయంలో తల్లిదండ్రులకు చక్కని అనుభవముంటుంది కూడ.

మనకు తెలిసిన విషయాలు ఎన్నోవున్నాయి. కాని, సోమరితనం, నిర్లక్ష్యం చేతనో మరేకారణం చేతనో వాటివల్ల సరియగులాభం పొందలేకుండా వున్నాము. ఈనాటి పిల్లలు రేపటి పౌరులనిన్ని, రాష్ట్రభవిష్యత్తు వాళ్లమీదనే ఆధారపడియున్నదని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదుకదా? కాని, యీనగ్నసత్యాన్ని ఏపరాష్ట్రాలు ఎంత వరకు గుర్తించినాయో యోచించవలసిన సమస్య.

రాష్ట్రాల సంగతలావుంచండి. తమ పిల్లల వికాసానికి బొమ్మలు ఎంతవరకు వుపకరిస్తాయని యోచించుకొనే వ్యక్తులెందరుందురో వూహించండి. పిల్లలమీదగల మమకారంచేతను, ఒక్కొక్కప్పుడు వాళ్ల బాధపడలేకను, కొనిపెడుదురే కాని వాటి ప్రయోజనాన్నిగూర్చి యోచనే చేయరు. దేశఔన్నత్యంకొరకుపకరించే యీ బొమ్మల సమస్యనుగురించి ఒకవ్యక్తేగాదు, పరిపాలనా సంస్థలుకూడా గమనించవలసియుంది.

ప్రపంచంలో అనేక దేశాలు యీనాడు అనతికాలంలోనే నాగరికతచెంది ముందంజ వేస్తున్నాయంటే, ఆదేశప్రభుత్వము దేశౌన్నత్యానికి నిర్మించుకొన్న ప్రణాళికలలో బాలల విషయంలో ప్రత్యేక శ్రద్ధవహిస్తూవుంటుందనడం నిస్సందేహం. బాలబాలికలను భావిదేశ పౌరులుగా తయారుచేయటే ప్రభుత్వముయొక్క ముఖ్య వుద్దేశ్యమైయుండక తప్పదు.

నేడు అన్నివిధాలా అభివృద్ధిచెంది ముందంజవేస్తున్న దేశం రష్యా అనిప్రతీతి. బాలుర మానసిక వికాసం యత్యవసరమనుట దృష్టియందుంచుకొని, విద్యాబోధనా పద్ధతిలో బొమ్మలు చక్కగా వుపకరిస్తాయని గ్రహించింది. అందుచేతనే మాస్కోనగర సమీపంలో గోర్కీనగరంలో ఒకసంఘమును స్థాపించి, దానియాజమాన్యమున నొక ఆటవస్తువుల ప్రదర్శనశాల నిర్మించి దాదాపు రెండు శతాబ్దములకు పూర్వం చేయబడిన పూర్వపు ఆటవస్తువులుకూడా సేకరించి వుంచినారట. సుమారు అరువదివేల రకముల

బొమ్మలతో నేడు యీ ప్రదర్శనశాల విరాజిల్లుతూ రష్యాలో ముఖ్యంగా దర్శనీయస్థలాల్లో ఒకటిగా ఎంచబడుతూవుంది. ఇదిగాక, ఖోగోస్కీ, గోకేడేటస్ మొదలగు నగరాల్లో యీ ఆటవస్తువుల కొర్ఖానాలున్నాయట.

ఈబొమ్మలు కళాదృష్టిలో వున్నతస్థాయిలోనుండుటయేగాక బాలలను శీలవంతులుగాను, సుశిక్షితులుగాను, చేయుటకుపకరించును. బొమ్మలద్వారా దేశచరిత్ర, గౌరవము, ప్రాచీన కళావిశిష్టత పిల్లల హృదయంలో హత్తుకొనేటట్లు చేయడమే కళాకారుల వుద్దేశ్యము. దేశచరిత్ర వల్లెవేయునవసరం లేకుండా బొమ్మలుచూడగానే విషయములు చక్కగా గ్రహించుటకు దోహదమగుచున్నవి. దేశంలోని విభిన్నజాతుల ప్రఖ్యాత వ్యక్తుల విగ్రహములుంచుటచేతను, వారి సాంస్కృతిక సమాజిక విభిన్నతలు చక్కగా తెలియును. జారు చక్రవర్తుల పరిపాలనా విప్లవానంతరాభివృద్ధి, ఆయాకాలములలోని రాజకీయ, సాంఘిక, నైతికవిషయములు తెలుపుటకు యీబొమ్మలు చక్కని సాధనములయినవి.

బాలబాలికలను భావిపౌరులుగా తయారుచేయుటే కళాకారుల దృష్టి యగుటచేత నిరంతరం క్రొత్త డిజైనుల అన్వేషణచేస్తూ, నవీనత్వమును కనబరచుచూ విశిష్టమగు కళతోకూడిన అందమును సృష్టింతురు. బొమ్మలలో దుస్తులు, ఆభరణములు మొదలగునవి కనబఱచుటకు స్వాభావికంగా వాస్తవిక జీవితంలో సమన్వయించే అందమగు రంగులు, వార్నిషులు వాడుదురు. ఉత్కృష్టమగు కళతోకూడిన యీ బొమ్మలను నిర్మించి వివిధ సంస్థలకు, పాఠశాలలకు వస్తు ప్రదర్శన శాలలకు పంపుటచేత ప్రజలు తమ మాతృదేశపు మహత్వపూర్వకమగు ఘట్టాలను మరువకుందురని ప్రభుత్వపు అభిప్రాయము. ఈ విధంగా బొమ్మలు కేవలం సురక్షితులను చేయుటకేగాక జ్ఞానాభివృద్ధికికూడా మిక్కిలి తోడ్పడుచున్నవి.

పూర్వమునుండి సర్వకళలకు నిలయమైన మనదేశంలోనూకూడా చక్కని కళా సమన్వితమగు బొమ్మలుచేయు కళాకారు యీనాటికికూడా లేకపోలేదు. బెనారెస్, ఉదయపూర్, కాశ్మీర్, లక్నో, కొండపల్లి (ఆంధ్ర)మైసూర్ మొదలగు ప్రదేశములలో మట్టితోను, కఱ్ఱతోను, లోహములతోను చక్కని బొమ్మలు నిర్మింపబడుచున్నవి. కాని వీటిని నిర్మించుటలో కళాప్రదర్శన దృష్టి కంటె వ్యాపారదృష్టి అధికమనక తప్పదు. ఇట్టి పరిశ్రమలు పూర్వమునుండి మనదేశమందు వెలసియుండుటచేతనే యీ నాటికికూడా పండుగ రోజులలో నారీమణులు తమ గృహములను చక్కని బొమ్మలచేత అలంకరించి ఆనందమును కలుగచేస్తున్నారు. ఈ ఆచారమువల్ల ప్రతి గృహముకూడా ఒక కళా ప్రదర్శనశాలయై కళావిశిష్టతను చాటుచుండును.

బాలల మనోవైజ్ఞానిక వికాసమునకై యీ ఆటవస్తువు లెంతవరకుపకరించునో గుర్తించి, తగు మార్గముల నన్వేషించి, ప్రతి విద్యాసంస్థయందును, జిల్లాయందును, రాష్ట్రమందును, బొమ్మలనస్తు ప్రదర్శనశాలలు నిర్మించవలెను. ఇట్లు చేయుటచేత కళాకారులకు జీవనోపాధి కల్గించుటేగాక, నిర్జీవమైపోతున్న యీ గృహపరిశ్రమ సజీవమగును.

మానసిక, శారీరక వికాసంతో తయారైన బాల బాలికలు భావిపౌరులై, పాలకులై దేశమును సుఖప్రదముగా చేసుకోగలరు.

జె. కె. టి. స్వామి

---



అభ్యుదయ చిత్రకారుల సంఘము వారు ఏర్పరచిన చిత్రప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ మద్రాసు గవర్నరుగారు యిట్లుపన్యసించిరి.

మద్రాసు ప్రభుత్వం చిత్రకళాభివృద్ధికి ఎక్కువ ఆసక్తిని చూపుచున్నది. చిత్రకారుల ప్రోత్సహించటానికి, ప్రజలకు చిత్రకళయందభిరుచి కలిగించటానికి మద్రాసులో జాతీయ చిత్రకళామందిరాన్ని నెలకొల్పదలచింది.

ఒరిస్సా రాష్ట్ర శాసన సభాధ్యక్షుడు తన భార్య తనతో ఎన్నికలలో పోటీ చేయ నున్నందున, విరమింపజేయుటకు చేసిన ప్రాయోపవేశం సందర్భమున ఒరిస్సా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ ఆర్గనైజరు శ్రీమతి సరళాదేవి యీక్రింది విధంగా ప్రకటించింది.

రాజకీయాలలో స్త్రీలు ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలని ఒకవంక ప్రధాని నెహ్రూ చెబుతుంటే, కొందరు తమ భార్యలభావ, క్రియా స్వాతంత్ర్యాలను సహించలేక పోవడం, ప్రతీపమార్గాల ద్వారా బలవంతం చేయడం తగదు.

మదరాసు జిల్లా ఆంధ్రకాంగ్రెస్ అధ్వర్యమున జరిగిన బహిరంగ సమావేశంలో శ్రీ ఆర్. బి. రామకృష్ణ రాజుగారిట్లుపన్యసించారు.

శాసనసభలోగాని, మంత్రివర్గములోగాని, ప్రాజక్టులలోగాని ఇప్పటి కలగాపులగం రాష్ట్రములో కన్న ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమకు ఏవిధంగా చూచినా, శ్రేయస్కరంగానే యుంటుంది.

కేంద్ర ఆరోగ్యమంత్రి శ్రీమతి రాజకుమారి అమృత్ కౌర్ రేడియో ప్రసంగం చేస్తూ యిట్లనిరి.

దేశంలో క్షయవ్యాధిని నిర్మూలించుటకు ప్రజలంతా సహకరించ వలెను. క్షయవ్యాధి నివారణ నిధి సేకరణ నిమిత్తం ప్రత్యేకమైన స్టాంపులను అచ్చువేయించి అమ్మించుచున్నాము. వాటిని విరివిగా కొని ఈ ఉద్యమాన్ని జయప్రద మయ్యేటట్లు చూచేబాధ్యత ప్రతియొక్క పౌరునిమీదనున్నది.

కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కార్యవర్గ సమావేశ సందర్భంలో కలకత్తాలో శ్రీ ఆచార్యకృపలానీ యిట్లు చెప్పిరి.

కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని సర్వోదయ వ్యవస్థ యొక్క రాజకీయ లక్ష్యాంతరంగరంగా భావించవచ్చును. గాంధీజీ విధానాన్ని అనుసరిస్తేనే కాని దేశానికి మోక్షం లేదని ప్రజాపార్టీ భావిస్తున్నది.




దేవీభాగవతం, కవయిత్రి శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు, కవితాసమితి, మెయిన్‌రోడ్డు, విశాఖపట్టణము వెల రు 12-8-0.

ఇది పవిత్రగ్రంథము. శైవులకు, శాక్తేయులకే కాక హిందూప్రజానీకానికంతటికి పఠనీయగ్రంథము. మొట్టమొదట ఉత్తర హిందూస్థానములో నవతరించిన దేవీ భాగవతము మనప్రాంత్యములో కూడ చాలకాలమునుండి ప్రసిద్ధికెక్కినది.

దేవీభాగవతమును మొట్టమొదట ఆంధ్రమున గద్యపద్యములలో కొందరు రచించిరి, కాని అవి పండితులతోబాటు పామరులకందుబాటగు శైలిలో లేవు. కాబట్టి మత, పురాణ, కావ్యగ్రంథములును సులభగ్రాహ్యమైన భాషలో రచించిననే కాని జనసామాన్యానికి కరతలామలకం కాజాలవనే ఉద్దేశంతో నీగ్రంథమును శ్రీమతి రుక్మిణమ్మగారు రచించారు. ఆమె ఉద్దేశానికనుగణ్యంగా నీగ్రంథమునందలి భాష సులభశైలిలో సరళంగా నడిచింది. గ్రంథము షుమారు 1000 పుటలు కలదైనను చదువుచున్నంతసేపు వుత్సాహవంతముగా నుండును; ఈ గ్రంథపఠనవలన పురాణవిజ్ఞానము అచిర కాలములోనే యభివృద్ధియగుననుటకు సందేహములేదు. భాషాభివృద్ధికికూడ తోడ్పడును.

తెలుగువారిచేతులలో యింటింట నుండతగిన గ్రంథము. ఈ గ్రంథరచన రుక్మిణమ్మగారికి విశేష కీర్తిని చేకూర్చగలదు.

హృదయ సౌందర్యము, రచన బాల సరస్వతి, గ్రంథములు లభించు చిరునామా కె. లక్ష్మణ, ఎర్రగుంట్ల (పోష్టు), కడపజిల్లా, వెల రు 1-0-0

ఇది కథల సంపుటి. హృదయ సౌందర్యము శీర్షికగల కథతో ప్రారంభమగుచున్నది. కథలు చిన్నవిగానుండి భావపూరితముగానున్నవి. ప్రతియొక్కకథ మానవుని దైనిక జీవితములోని సంఘటనలను ప్రతిబింబింపచేయుచు ఏదో ఒక లక్ష్యంతో వ్రాయబడినది.

కథాసాహిత్యముద్వారా పాఠకలోకానికి కేవలము వినోదము కలిగించడముతో తృప్తిపడక విజ్ఞానాన్నికూడ కలిగించడమే రచయిత్రి ఉద్దేశము. ఆయుద్దేశము చాలవరకు నెరవేరినదనే చెప్పవచ్చును.

కథలనడకసయితం సహజంగాను సరళమైన భాషలోనున్నది.

రామనామప్రభావము, శ్రీ కుందర్తి వెంకటనరసయ్యగారు. ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి. వెల 0-6-0

శ్రీ వెంకట నరసయ్యగారు అనేక భక్తిప్రధానమయిన గ్రంథములను రచించిరి. వానిలోనిది యొకటి.

ఇందు రామనామప్రభావము వివరించబడింది. భక్తులు, రామనామస్మరణ, జపమువలన ప్రభావము యీగ్రంథ పఠనమువలన తెలిసికొనగలరు.

పతిత: శ్రీ గోపరాజు రామారావ్, గోపీపల్లి కేషన్సు, సత్యనారాయణపురం, విజయవాడ-2. వెల 0-8-0.

ఇదిసాంఘిక, ఆర్థిక, రాజకీయ పతనాలను విరూపించే నవల.

స్త్రీ అబలగా, అజ్ఞానిగా మగవారికి ఆటవస్తువుగా చూడబడుతూ అవకాశంగా వినియోగించుకొని అనేకమంది అమాయిక స్త్రీలను మోసం చేస్తున్నారు. అట్టిసంఘటననే యిందులో కథావస్తువుగా గ్రహించబడింది.

ఇందలి కథానాయిక జయ ఒక స్వార్థపరునిచే మోసగించబడి శీలాన్ని, ధనాన్ని కోల్పోయి నిరాశ్రయయైంది. ఆమెకు సంఘసేవా తత్పరుడు. తన అనాథ శరణాలయంలో ఆశ్రయమిచ్చి మహిళను ఆదర్శంగా తయారుచేయమని బోధించుతాడు. అన్నివిధముల పతనము చెందిన జయకు అనాథశరణాలయమే ఆధారమైంది.

ఈనవల సంఘసేవను ప్రబోధిస్తూ ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుటను ప్రోత్సహిస్తున్నది.

# సంపాదకీయములు

## ఆంధ్ర మహిళాసభ

మద్రాసునందలి ఆంధ్రులచే నిర్వహించబడుచున్న సంస్థలలో, మహిళాసభ గర్వకారణమయినది. వారు మహిళాభ్యుదయానికి చేయుచున్నకృషి ప్రశంశనీయము. విద్యాబోధనే కాక మహిళలకు లలిత కళలయందు, సంఘసేవయందు, మహిళాసభవారు శిక్షణయిచ్చుచు దినదినాభివృద్ధినందుచుండుట సంతోషపడవలసిన విషయం.

ఆంధ్ర మహిళాసభవారు నర్సింగుహోమును, నర్సింగుశిక్షణ కేంద్రాలను స్థాపిస్తున్నారు. ఇందుకుగాను కేంద్ర పార్లమెంటువారు 80 వేలరూపాయలను ప్రారంభ వ్యయముక్రిందను, ఏడాదికి 15 వేల రూపాయల ప్రకారం 5 సంవత్సరములు గ్రాంటుయిచ్చుటకు తీర్మానించారు.

ఈ పథకముక్రింద ప్రస్తుతానికి 20 మంచాలతో నర్సింగ్ హోమును, 12 మంది విద్యార్థినులకు ఆగ్జిలరీనర్సింగ్, మంత్రసానులకు శిక్షణనిచ్చే కేంద్రాన్ని నెలకొల్పడానికి నిశ్చయించబడింది. నర్సింగ్ హోము, శిక్షణకేంద్రాలభవన నిర్మాణమునకు 40 వేలు ఖరీదుచేసే స్థలాన్ని మద్రాసు ప్రభుత్వము యిచ్చింది.

ఈ ప్రభుత్వ ఉచితనిర్ణయం హర్షింపతగింది. ప్రస్తుతము వైద్యసహాయము కొరతగానున్న పరిస్థితులలో ఆగ్జిలరీనర్సింగ్, మంత్రసానులకు శిక్షణ, నర్సింగ్ హోము స్థాపన ఎంతైన అవసరమయినవి. ప్రభుత్వ సహాయంతోబాటు ప్రజలసహాకారం విరివిగా లభించడం యీ ఉత్తమ సంస్థనిర్వాహణ జయప్రదంగా జరుగుటకు అవసరం. ఆంధ్రమహిళాసభవారి అచంచలమైన కార్యదీక్షను కొనియాడుతూ సభయొక్క అభివృద్ధిని ఆశిస్తున్నాము.

## హిందూ కోడ్ బిల్లు

హిందూకోడ్ బిల్లుపైచర్చ వాయిదా పడుటతో సంఘసంస్కర్తలలో ఒకవిధమైన నిస్పృహ ఏర్పడింది. ఈబిల్లు ఆమోదించడం వలన కొంతవరకు అభ్యుదయకరమైన సంస్కరణలు జరుగ గలవని ఆశించిన వారికి ఆశాభంగము కలిగింది.

మనకు లభించిన స్వాతంత్ర్యముతోబాటు దేశము సర్వతోముఖాభివృద్ధి నొందుటకు మార్పులు అవసరం, అందుకు తగిన శాసనములు అవసరం, ఇట్టి శాసనములుచేయ సమకట్టినప్పుడు అవరోధములు సహజము. కాని యదార్థ పరిస్థితుల దృష్ట్యా ప్రజాశ్రేయస్సునుకోరి ప్రభుత్వము, సంఘ సంస్కర్తలు తీవ్రముగా కృషిచేసి సంస్కరణలను సాధించవలెను.

పురుషునితోబాటు స్త్రీకిగల స్వేచ్ఛ, హక్కులను నిర్ణయించ పూనుకొనిన యీ బిల్లుపై సాకల్యముగా చర్చజరిగి ఆమోదించ బడవలసినది.

ఇప్పటికైనా సంఘ సేవకులు, సంస్కర్తలు యీబిల్లును విశేషముగా ప్రచారముచేసి ప్రజల ఆమోదాన్ని సానుభూతిని పొంద ప్రయత్నించవలెను. ఈ కృషి త్వరలో యీ బిల్లును చట్టముగా రూపొందించుట కుపకరించును.

# శ్రీ ఖరనామ సంll ర ఆశ్వయుజ కార్తీక మాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | మం | పా. 59-36 అశ్వ 12-56 ది 2-36 |
| | 17 | బు | త 60-10 భర 15-50 రా 18-49 అట్లతద్ది |
| | 18 | గు | త 1-48 కృ 20-2 ది 3-18 |
| | 19 | శు | చ 5-8 రో 24-53 ది 3-18 |
| అక్టోబరు నెల | 20 | శ | పం 9-18 మృ 30-31 రా 24-31 |
| | 21 | ఆ | ష !3-44 ఆర్ద్రా 36-24 త్యాజ్యాభావః |
| | 22 | సో | స 14-26 పున 42-13 ది 9-19 |
| | 23 | మం | అ 23-2 పుష్య 48-5 ది 4-10 |
| | 24 | బు | న 27-15 ఆశ్లే 53-25 ది 22-56 |
| | 25 | గు | ద 30-48 మఘ 58-0 ది 25-40 |
| | 26 | శు | ఏ 33-33 పూఫ 60-10 ది 20-43 |
| | 27 | శ | ద్వా 35-20 పూఫ 1-59 ది 20-43 |
| | 28 | ఆ | త్ర 35-54 ఉఫ 4-38 ది 26-10 |
| | 29 | సో | చ 35-9 హ 6-7 ది 26-13 |
| | 30 | మం | ● అమా. 33-17 చి 6-26 ది 20-12 దీపావళి ధనలక్ష్మీపూజ |
| | | | కార్తీక మాసం |
| 1951 సంll | 31 | బు | శుక్లపాడ్యమి 30-10 స్వా 5-27, ది 18-58 కార్తీక స్నానారంభం |
| | 1 | గు | వి 26-0 విశా 3-24 ది 12-44 |
| | 2 | శు | త 20-54 అనూ 0-23, జ్యే 56-3 ది 13-28 త్రిలోచన గౌరీవ్రతం |
| | 3 | శ | చ 15-12 మూల 52-4 ది 14-59 నాగచతుర్థి దూర్వాగణపతివ్రతం |
| | 4 | ఆ | పం 5-57 పూషా 47-37 ది 14-18 |
| | 5 | సో | ష 2-29 ఏష్యా 53-54 ఉషా 43-2 ది 6-5 |
| | 6 | మం | అ 50-18 శ్ర 38-51 రా 19-44 |
| నవంబరు నెల | 7 | బు | న 45-24 ధ 35-3 రా 23-40 |
| | 8 | గు | ద 40-32 శత 32-13 రా 19-16 |
| | 9 | శు | ఏ 33-2 పూభా 30-16 రా 25-32 |
| | 10 | శ | ద్వా 34-43 ఉభా 29-25 రా 31-15 చిల్కుద్వాదశి |
| | 11 | ఆ | త్ర 33-33 రే 29-48 పునస్త్యాజ్యాభావః |
| | 12 | సో | చతు 33-46 అశ్వ 31-24 ది 21-8 వైకుంఠవ్యాసపూజా జ్వాలాతోరణం |
| | 13 | మం | ○ పూ 35-9 భ 34-8 పునస్త్యాజ్యాభావః |
| | 14 | బు | కృ. పా. 33 33 కృ 38-0 ది 6-4 కృత్తికాదీపోత్సవం |
| | 15 | గు | ది. 41-3 రో 42-42 ది 21-8 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

